†

శ్రీ క్రైస్త

[illegible]



# కన్యమరియమ్మ పిల్లల సభయొక్క క్రమపుస్తకము.

*Imprimatur P. Rossillon*
*Bishop of Vizagapatam.*



జ్ఞానపురం
పాస్త్రేరు స్టేషన్.

(౩౦౦ ప్రతులు.)

PRINTED AT THE V. R. C. PRESS, VIZAG.
1922.

†

శ్రీ త్రైక

సర్వేశ్వరాయ నమః.

# కన్యమరియమ్మ పిల్లల సభయొక్క క్రమపుస్తకము.

*Imprimatur P. Rossillom*
*Bishop of Vizagapatam.*

జ్ఞానపురం
వాల్తేరు స్టేషన్.

(500 కాపీలు.)

PRINTED AT THE V. R. C. PRESS, VIZAG.

1922.



# సభయొక్క ముఖ్యమైన అభిప్రాయమును గురించి.

ఈసభ కన్యమరియమ్మ పిల్లలపేరట స్థాపించబడినది. సెప్టెంబర్ 8 వ తేదిని కన్యమరియమ్మ పుట్టినపండుగ. ఈసభలో ముఖ్యపండుగగా యున్నది.

---

ఈసభ వారలు ఈపండుగకొరకు గొప్పభక్తితో ఆయత్తముచేయుదురు. కన్యమరియమ్మ పండుగలన్ని అధికభక్తితో కొనియాడుట విధియైయున్నది.

కన్యమరియమ్మయొక్క
ముఖ్యమైన పండుగలు యేవంటే?

ఫిబ్రెవరి 2 వ తేది—కన్యమరియమ్మ శుద్ధికరపండుగ.
———11 వ తేది—కన్యమరియమ్మ దర్శనపండుగ.
మార్చి 25 వ తేది—కన్యమరియమ్మమంగళవార్త పండుగ.
జులై 2 వ తేది—కన్యమరియమ్మ ఎలిజబెత్తును సందించుట.

———16 వ తేది—కర్మేల్ ఉత్తర్యమాతపండుగ.

ఆగష్టు 15 వ తేది—కన్యమరియమ్మ మోక్షమునకు ఎత్త బడుట.

సెప్టెంబర్ 12 వ తేది— కన్యమరియమ్మ పరిశుద్ధనామ కరణపండుగ.

సెప్టెంబర్ 15: వ్యాకులమాత పండుగ.

అక్టోబర్ 1 ఆదివారము—జపమాలమాతపండుగ.

నవంబర్ 21 వ తేది—కాణుకమాతపండుగ.

డిశంబర్ 8 వ తేది—కన్యమరియమ్మ జన్మపావము లేక ఉద్భవించిన పండుగ.

ఈరోజులలో దివ్యపూజకనుటకును, సత్ప్రసాదములో కొనుటకును ప్రయత్నించవలసినది.

ఈవిధులను అనుసరించుటకు అసాధ్యమైతే వారిప్రధానఅధికారికి తెలియపరచవలెను.

వీరువచ్చే ఆలోచనసభకూటములో మార్గచూపరికి తెలియపరచుట.

1. ఈసభ కన్యమరియమ్మపిల్లలని అస్పైరెంట్లని రెండువిధములుగా ఏర్పరచబడినది.

కన్యమరియమ్మ పిల్లలగుటకుముందుగా అస్పైరెంట్లనడతను మిగుల శ్రద్ధతో గమనించవలసినది.

2. ప్రవేశ అధ్యాయములో వివరించబడిన మంచిగుణములన్ని కలిగియుంటేనేతప్ప కన్యమరియమ్మ పిల్లలలోగాని అప్పెరెంట్లలోగాని ఎవ్వరును చేర్చుకొనబడరు.

3. కన్యమరియమ్మ పిల్లలందరియొక్క పేర్లను ఒకచట్టము కట్టించినజాబితాలో తరగతివ్రాయబడి గుడిలో ఉంచబడును.

అప్పెరెంట్లుపేర్లు ఒకజాబితాలో వ్రాయబడి గుడిద్వారముదగ్గర తగిలించబడును. ఇందువల్ల ఈసభలో ప్రవేశింపకోరే వారి ప్రవర్తనలను అందరు లక్ష్యపెట్టుచుందురు.

4. ఈసభ ఏలాగు నడుపబడుచున్నదంటె! మొదట—విచారణగురువువల్లను రెండవది—ప్రధానఅధికారివల్లను, ఈయిద్దరి సహాయకులవల్లను, ఆలోచనకర్తలవల్లను కన్యమరియమ్మ పిల్లల సంఖ్యకు తగినట్లుగానే ఆలోచనకర్తల సంఖ్యయును ఉండును.

5. ప్రధానఅధికారి—సహాయఅధికారి— ఆలోచనకర్తలును—కన్యమరియమ్మ పిల్లలవల్ల ఏర్పరచబడుదురు. ఏలాగంటె? ఏర్పాటు అధ్యాయములో చెప్పబడినవిధముగా చీట్లువేసి ఏర్పరచుదురు.

6. మార్గచూపరి (ప్రత్యేకముకానియెడల) ప్రధానఅధికారి ఆలోచనసభకున్ను కన్యమరియమ్మ పిల్లలకూటమునకును ముఖ్యకర్తగా యుండవలెను.

7. ఆలోచనసభ ప్రతినెల మొదటిఆదివారముగాని లేక ఏదోక ఆటంకము కలిగినయెడల రెండవ ఆదివారముగాని సభకూడవలెను. మార్గచూపరి ఈసభయొక్క మేలుకొరకు ఒక్కొకప్పుడు ఆలోచనసభ కూర్పవచ్చును.

8. అప్పైరెంట్లయొక్కయు కన్యమరియమ్మ పిల్లలయొక్కయు చీట్లువల్లనే ఆలోచనసభలో చేర్చుకొనుటకు శక్తిగలదు.

అప్పైరెంట్లలో చేర్చుకొనబడుటకు సగముకంటె అధిక సంఖ్యచేత చీట్లు వేయబడి యుండవలెను.

కన్యమరియమ్మ పిల్లలకు రెండింట మూడవవంతుగా యుండవలెను. అగత్యమైనయెడల మార్గచూపరియు చీటి వేయవచ్చును.

9. సభయొక్క ఉద్యోగములైన లేకత్వమును రూకల అధికారత్వమున్ను ఆలోచన సభవల్ల నియమించబడును. ఈయుద్యోగములు ఆలోచన సభవారలకు మాత్రము యివ్వబడును.

10. ఈఏర్పాటులో ఉద్యోగమునెరవేర్చువారలుమార్గచూపరివల్ల నియమించి తెలిసికొనబడవలెను.

11. ప్రధానఅధికారిగాని ఆలోచన సభవారలలో ఒకరుగాని మరణించినను లేక పంపివేయబడినను ఆయుద్యోగ

ము నెరవేర్చుటకు వచ్చేసభ ఏర్పాటువరకు వార్ల స్థానము లో ఆలోచనసభవల్ల ఏదొకరు నియమించబడుదురు.

12. సభలోని ఏదొకరు ప్రధానాధికారియొక్క న్యాయములను విన లేనియెడల అట్టివారలను శిక్షించుటకు ఆలోచనసభకు అధికారమున్నది.

సభలోని ఒకరు గొప్పతప్పిదము చేసియుండినను లేక దీర్ఘకాలము అశ్రద్ధవల్ల తనవిధులను నెరవేర్చ లేక పోయిన ను అట్టివారు ఆలోచనసభవల్ల శిక్షించబడవలెను. ఉ॥ వారినుండి కొంతకాలమువరకు స్వరూపమును తీసివేయుట. లేక కొంత కాలము సభనుండి వెలివేయుబడుట. లేక కన్య మరియమ్మ పిల్లలందరియెదుట క్షమాపణ అడుగుట. ఈ మొదలైనవి.

కన్యమరియమ్మ పిల్లలలో ఎవరైనను అజ్ఞాని వివాహము చేసుకొనినయెడల సభలోనుండితోసివేయబడుదురు.

ఏదొకరు మితమించి తాగినను అక్రమప్రవర్తనగలిగియుండినను అట్టివారిని ఒకసంవత్సరమువరకు సభలోనుండి వెలివేయవలెను.

ఆసంవత్సరము గడచిన తరువాత ఆతప్పిదములలో పడకుండనట్టయితే తిరిగి సభలో ప్రవేశింప అడుగవచ్చును గాని మొదటవలెనే అప్పైరెంట్లుఅయిన పిమ్మట కన్యమరియమ్మ పిల్లలలో చేరుటకు అడుగవచ్చును.

సభలో చేర్చుకొనుటకున్ను పంపివేయుటకున్ను ఆలో చనసభకు అధికారముగలదు.

ఆలోచనసభవల్ల తెలుసుకొనబడిన తప్పిదస్తునికి శిక్ష విధించ మార్గచూపరిమాత్రము తెలియజేయవలెను.

13. సహాయఅధికారియైన ఆలోచనకర్తయైన ఏదో కతప్పిదముచేసియుంటె, వారలతప్పిదమునకు తగినట్లుగా కొంతకాలపర్యంతము వారలను ఆలోచనసభనుండి వెలివే యుటకు మార్గచూపరికిన్ని, ప్రధానఅధికారికిన్ని అధికార ము గలదు.

ప్రధానఅధికారిని తనఉద్యోగమునుండి తప్పించుటకు అగత్యముండినయెడల కన్యామరియమ్మ పిల్లలందరుచేరి చీ ట్లు వేయవలెను. సగముకంటె ఎక్కువచీట్లలో వారి ఉ ద్యోగమునుండి తప్పించవలెనని పడియుంటె తక్షణమే వె లివేయవచ్చును.

అయితే సగముకంటె అధికచీట్లలో తనఉద్యోగమును నిలువచేయునట్లు పడియుంటే మార్గచూపరి వారికి ఏదో కతగినశిక్షవిధించి ఉద్యోగములో యుంచవచ్చును. లేదా సభయొక్క మేలుకొరకు వేరువిధముగా ఆలోచించినయె డల ఉద్యోగమునుండి తప్పించుటకు మార్గచూపరి తాము స్వంతముగా చేయవచ్చును.

# 2 వ అధ్యాయము.

# కన్యమరియమ్మ పిల్లలసభ యొక్క విధులు.

కన్యమరియమ్మ పిల్లలు ఈక్రింద వ్రాసిన అనుష్ఠానములను అనుసరించకపోతే పాపము కట్టుకొనుట లేదుగాని కన్యమరియమ్మయందు గొప్పభక్తియును తమసభయెడల నిజమైన ప్రేమయును యుండినట్టయితే ఈక్రమములు తాము అనుసరించుచు ఇతరులుగూడ అనుసరించునట్లు ప్రయాసపడుదురు.

1. సభలో జీవించినవారలకొరకు ఏడాదికి ఒక్కసారి కన్యమరియమ్మ పుట్టినపండుగనాడు దివ్యపూజ సమర్పించబడును. నవంబర్ మాసములో సభయందు మృతిపొందిన వారలకొరకు దివ్యపూజ సమర్పించబడును.

2. సభవారలలో ఏదొకరు జబ్బుగాయుండినట్టయిన వారపుకూటములో వారికొరకు తమజపములు ఒప్పగించవలెనని ఆజ్ఞాపించబడియున్నది.

3. సభవార్లలో ఏదొకరు మరణము పొందినట్లయిన వారిఆత్మ విశ్రాంతికొరకు దివ్యపూజ సమర్పించబడును.

వచ్చే మొదటికూటములో సభవారందరిచేత దేవ్రాం దిప్ అనే జపము బహిరంగముగా చెప్పబడును.

ఇదిగాక ప్రతి కన్యమరియమ్మపిల్ల వారి ఆత్మవిశ్రాంతి కొరకు ఒకసారి దివ్యసత్ప్రసాదము ఒప్పగించవలయును.

4. కన్యమరియమ్మ పిల్లలు నెలలో రెండుసార్లును అ స్సైరెంట్లు నెలలో ఒకసారియు దివ్యసత్ప్రసాదములో కొనవలెను.

5. ప్రతిఆదివారకు కన్యమరియమ్మ పిల్లలందరుకలిసి మార్గచూపరిచే నియమించబడిన గంటలో దేవమాత నిష్కళంక ఒఫీసియ్యూం, అర్చ్ వ్య. బెర్నర్డు అనెడు జపమును, జన్మపాపములేక ఉద్భవించిన మరియమ్మాయనెడు జపమును మూడుపర్యాయములు చెప్పవలెను.

ఈజపములు చెప్పినతరువాత మార్గచూపరివల్ల వారపుకూటము జరుగును ఈకూటముయొక్క అభిప్రాయము వేరే అధ్యాయములో వివరించబడును. సంవత్సరములో 3 దినములు తపస్సుచేయుదురు.

ఈదినములలో గడచినపాపములను కొరతలను శ్రద్ధతో పరిశోధించి వచ్చేసంవత్సరముకొరకు స్థిరమైన ప్రతిజ్ఞ చేయుదురు.



# 3 వ అధ్యాయము.

# కన్యమరియమ్మ పిల్లల ప్రవేశన.

## సభవారల ప్రవేశన మిక్కిలి గొప్పసంగతి.

ఎందుకంటె: ఎంచబడిన సభవారలయొక్క మంచితనమునకున్ను చెడుతనమునకున్ను తగినట్లు మంచిగానైన చెడుగానైన మాత్రుక యివ్వబడును.

సభవారల చేర్చుకొనువిషయములో ఆలోచనసభ మిగుల జాగ్రత్తగా యుందురు.

సభవారలు తమభక్తివల్లను, విధేయత్వమువల్లను, పరస్నేహమువల్లను, విశేషప్రేమను వైరమును తప్పించుటవల్లను ఇతరులకు మంచిమాత్రుకగా యుండునట్లు చేర్చుకొనబడుదురు.

---

## ఆస్పైరెంట్ల ప్రవేశనిబంధనలు.

---

1. ఈ సభయందు ప్రవేశింప కోరిక గలవారలు 12 సం॥ ప్రాయమైనను గలిగి యుండవలెను.

2 వీరు స్వంతగ్రామములో ఒక సంవత్సరమైనను జీవించి యుండవలెను.

3. వారలు చదువను వ్రాయను నేర్చియుండవలెను.

4. మంత్రములన్నియు చిన్నజ్ఞానోపదేశమైనన్ను నేర్చియుండుట.

5. కన్య మరియమ్మ యందు గొప్ప భక్తియును సభవారలలో చేరుటకు అధిక ఆశయును యుండవలెను.

6 వారల ప్రవర్తనలు ఇదివరకు మంచివిగా యుండినట్లయిన దేవానుగ్రహముచే వారితోడులలో చేయుటకు నమ్మకము కలిగించవలెను.

7. ఈ సభయందు ప్రవేశించ కోరిక గలవారు కూటములో మూడు నెలకు ముందు మనవి చేసియుండవలెను. అటువంటి అస్పైరెంట్ల సభలో చేర్చుకొనబడక పోతే తిరిగీ మనవిచేసి తరువాత 3 నెలలవరకు కాచి యుండవలెను.

8. సభయందు చేర కోరిక గలవారు వచ్చే కూటములో మార్గచూపరికి తెలియపరిచినట్లయిన వారు ఆలోచన సభకు తెలియపరచెదరు.

వారివద్ద అస్పైరెంట్లు అగుటకు అవసరమగు సుగుణములుండిన ఆలోచన సభవారలు పరీక్షించవలెను.

ఆలోచనసభయొక్క విచారణను మార్గచూపరి ప్రవేశించేవారికి తెలియ పరచవలెను. ఆదేసమయములో ఏ మన

కొరతలు తప్పితములు యుంటె మార్గచూపరి బయలు పరచి వారికి తెలుప వలయును.

9. అస్సైప్రెంట్ల సభలో చేరుటకు ఏరోజైనను సరేగాని ముఖ్యముగా కన్యమరియమ్మ పండుగదినములయితే మేలుగానుండును. కన్యమరియమ్మ పిల్లల సంఖ్యవలన కాకుండ వారలభక్తి మంచిప్రవర్తనలవల్ల కన్యమరియమ్మ హృదయమును సంతోషపరుచునట్లుగా యుండవలెనని ఆలోచనసభ చూడవలసినది.

10. ప్రవేశనదినమందు కన్యమరియమ్మ పిల్లలందరి యెదుట సభలో ప్రవేశించ కోరు వారు ఆయమ్మగారి పాదములదగ్గర మోకాళ్లుంచి సమర్పణజపము బిగ్గరగా చదువుదురు. అప్పుడు మార్గచూపరి అస్సైప్రెంట్ల స్వరూపముకు చేతికిఇచ్చుదురు.

కన్యమరియమ్మ పిల్లల నిబంధనలు.



1. సభయందు ప్రవేశించకోరికగలవారు క్రొత్తసత్ప్రసాదము తీసియుండవలెను.

2. వీరు అస్సైప్రెంట్లసభలో ఆరుమాసములు ఉండియుండవలెను.

3. వీరు కన్యమరియమ్మయందు గొప్పభక్తియు ప్రేమయు మంచిప్రవర్తనలు గలిగియుండినట్లు గురుతుయివ్వవలెను.

4. వీరు ఆలోచనసభయొక్క రెండింట మూడు చీట్లు గలిగియుండవలెను.

కన్యమరియమ్మ పిల్లలప్రవేశనలు రెండుయున్నవి. ఒకటి కన్యమరియమ్మ పుట్టినపండుగరోజునయును మరియొకటి మేనెల అంత్యమునయున్ను.

సాధారణముగా మార్గచూపరివల్ల దివ్యపూజ చేయబడినతరువాత ప్రవేశనగడియ జరుపబడును. అప్పుడు ఆవే మారిస్తెల్లా అను స్తోత్రసంగీతము పాడి కొన్ని మంత్రములు చెప్పబడును.

పాటసమయములో సభలోప్రవేశింప కోరికగలవారలు కన్యమరియమ్మపాదములదగ్గర మోకాళ్లూంచియుండగా మార్గచూపరి చిన్నప్రసంగముచేయుదురు. అంతట ప్రవేశనగడియవచ్చును. అది అయినపిమ్మట మాగ్నిఫికాట్ అనే స్తోత్రజపము పాడబడును.

సభలోచేరిన ప్రతిపిల్లయొక్క పేరును, ప్రాయమును ప్రవేశతేదీ ఈమొదలైనవి లేఖకునివల్ల సభయొక్క పట్టిలో వ్రాయబడును.

ప్రతిఆదివారము పూజకును ప్రతిసారి దివ్యసత్ప్రసాదములోకొనునపుడును కన్యమరియమ్మపిల్లలు కూటము కూడినపుడును తమ స్వరూపమును ధరించుకొనవలెను.

స్వరూపములు రూకలఅధికారిదగ్గర ఉంచబడును. తమయింద్లకు తీసుకొనిపోరాదు. అయినప్పటికి ఒకచిన్న దేవమాతస్వరూపము మెడలోయుంచవలెను.

# 4 వ అధ్యాయము

## సభకూటములు.

---

ఈసభయొక్క అభిప్రాయము ఏమంటే?

కన్యమరియమ్మను పొత్తుగా గౌరవించుటే. ఏలాగంటె ఈసభవారలు తమప్రేమగల పరమతల్లిని స్తుతించుటకును ఒకరి కొకరు ఆమెయొక్క పుణ్యములును అనుసరించుచూ సాయపరచుకొనుటకును అప్పుడప్పుడు అందరుకూడి జపించుదురు.

ఇద్దరు ముగ్గురుకూడి నాపేరిట జపము చెప్పినయెడల వారలమధ్య మేముందుమని మన జేసునాధస్వామి తమఅపోస్తులతో చెప్పినారు.

అందుచేత అందరుకూడి తమదివ్యతల్లిని ప్రార్థించిన వారలమీద తమ శ్రేష్ఠాశీర్వాదములను పాలించుదుమన్నారు.

ఇదిగాక ఈకూటమువల్ల కన్యమరియమ్మ పిల్లలు పర

స్నేహము భక్తి అధికరించి వారి కొరతలు, దుర్గుణములు దిద్దుకొనుటకు అధికఆశక్తులై యుందురు.

ప్రతి ఆదివారము నిమ్కళంక ఓఫీసియ్యుం చెప్పిన తరువాత కూటము జరుగును.

వారలో కన్యమరియమ్మ పండుగ వచ్చినట్లయిన ఆదినమువారము కూటము చేయబడును. మార్గచూపరివచ్చుటకు ఆటంకముగలిగినయెడల ప్రధాన అధికారి ఆకూటమునకు అధికారిగా యుండవలెను.

ఈకూటము వెని సాంక్తెస్పిరితుస్ అనేస్పిరితు సాంక్తు మంత్రముతోను జన్మపాపములేక ఉద్భవించిన మరియాఅనే సుకృతజపముతోను ఆరంభించబడును.

ఈజపము తరువాత ఒకచిన్నజపమును,జ్ఞానవాచకమును చదువుబడును. ఒకఆదివారము క్రమముల అధ్యాయమొకటిన్ని మరియొకఆదివారము వేద (భక్తి) పుస్తకములలోఒకటిన్ని చదువబడును.

ఈజ్ఞానవాచకము తరువాత కన్యమరియమ్మ పిల్లలకుఅగత్యమైనట్లుగా మార్గచూపరియైన ప్రధానఅధికారియైన వారలను హెచ్చరించి మంచిబుద్ధిచెప్పుదురు. సభవారలు వారములో ఏలాగు ప్రవర్తించినది మార్గచూపరి అప్పుడప్పుడు ప్రశ్నించుచుండవలెను. అందుకు దీనతగాను న్యాయముగాను జవాబు యివ్వవలయును. సభవారిలో ఎవ

్రైన తమతప్పిదమువల్ల దుర్మాతృక యిచ్చియుంటె కూటసమయమందే కన్యమరియమ్మ పిల్లలందరియెదుట మోకాళ్లూంచి క్షమాపణ అడుగవలెను.

సభలోని ఏదొకరు వ్యాధిగాపడియుంటె లేక చనిపోతె వారికొరకు ప్రార్థించునట్లు సభలోని యితరులకు కట్టడచేయవలెను. కన్యమరియమ్మపేర ఒకచిన్న సుకృతజపమువల్లను స్లీవగురుతువల్లను ఈసభ ముగించబడును

ప్రతిఆదివారము జరిగేకూటముకంటె నెలలో మొదటఆదివారము కొంచెము గొప్పగా జరుపబడును. ఈకూటముకొరకు దిగువయివ్వబడిన పద్ధతిని వెంబడించుదుము.

(1) వేనిసాంక్టె స్పిరితుస్ అను జపము అయినపిమ్మట ఒకకీర్తన పాడవలెను.

(2) కన్యమరియమ్మ పిల్లల పుణ్యములగురించియు మార్గచూపరి ఒకప్రసంగము (బోధన) చేయుదురు. ఈబోధన యీదినముచదివిన క్రమముల అధ్యాయముగురించి యివ్వబడును.

(3) ఈప్రసంగము తరువాత కన్యమరియమ్మపేరట ఒకకీర్తన పాడవలెను.

(4) మార్గచూపరి తమగొంతెత్తి సభవారల అందరిపేరట కన్యమరియమ్మకు సమర్పణజపము చెప్పవలెను.

(5) పుస్తకములు, స్వరూపములు కొనుటకున్ను ఆ

లంకారములకొరకును యింకా సభలోని వేరువేరు ఖర్చులని మిత్తమును రూకలఅధికారివల్ల రూకలు జమచేయబడును.

ప్రధానధికారి నెలకొకసారి అప్పై ప్రెరంట్లను చేర్చి వారలు పుణ్యముచేయుటకు అభ్యాసమున్న కన్యమరియమ్మ పిల్లలగుటకు కావలసిన నిబంధనలును నేర్పించుదురు.

ఈమాటలు వేన సాంక్తి అను జపమువల్లను ప్రియదత్త మంత్రముచేతను జన్మపాపములేక ఉద్భవించినమరియాయను సుకృతిజపముచేతను ఆరంభించబడి ప్రియదత్త మంత్రముచేతను జన్మపాపములేక ఉద్భవించిన మరియాయను సుకృతజపముచేతను ముగింపబడును.

# 5 వ అధ్యాయము.

## సభవారలయొక్క ఏర్పాటు.

కన్యమరియమ్మ పిల్లలు ఆలోచనకర్తలయందును నమ్మకముయుంచియున్నందున తామున్న వారలకు పుణ్యమార్గము చూపించి శక్తివంతులై యుందురు.

ఆలోచనకర్తలను ఏర్పరచుకొనుటలో మిగుల జాగ్రత్త గలిగియుందురు. కన్యమరియమ్మ పిల్లలు తమసభలో చేరువారలు ఆలోచనకర్తలవిధులను నెరవేర్చుటకున్న వారి

తోడివారలకు మంచి మాతృకయిచ్చుటకు శక్తియుంటే నే చేర్చుకొనవలెను.

ఏర్పాటుసమయములో ఫలాసి ఫలాని వారిపేరిమ్, వైరముచూపక దేవుని గొప్పమహిమను చూడక దేవుని గొప్పమహిమను కన్యమరియమ్మయొక్క గౌరవమును సభయొక్క జ్ఞానమేలులను గమనించవలెను

1. సంవత్సరములో రెండుఏర్పాటులు యున్నవి. ఒకటి కన్యమరియమ్మ పుట్టిన పండుగనాడు మరియొకటి మే నెలఅంత్యమున జరుగును.

2. కన్యమరియమ్మ పుట్టిన పండుగనాడు ప్రధాన అధికారియొక్కయు ఆలోచన కర్తయొక్కయు ఏర్పాటు జరుపబడును.

ముందుండిన ప్రధానఅధికారి ఏర్పరచబడకపోయినట్టయితే ఆలోచనకర్త కావచ్చును. మరియు సభలో ఏదొక యుద్యోగము ఇష్టపడి ఎంచుకొనచ్చును.

3. ఆరంభమున ఆలోచనకర్తలు ప్రతి యుద్యోగమునకు ఇద్దరిద్దరి వంతున తీయుదురు. కన్యమరియమ్మ పిల్లలు వారిలో ఒకొకరి చొప్పున ఏర్పరచుకొందురు. ఈఏర్పరచుకొన్నవారలు ఆలోచనసభ కర్తలనుండి తీయబడుదురు.

4. ఈఏర్పాటు ఈదిగువవివరించిబడిన విధముగా జరుపబడును.

అస్పిరెంట్లు లేకుండ కన్యమరియమ్మ పిల్లలుమాత్రము సభకూటము చేయుదురు. ఆకూటమునకు మార్గచూపరే కర్తగాయుందురు. అందులో వేనిక్రియతోర్ అను జపము పాడుదురు.

ఈయేర్పాటుయొక్క గొప్పతనముగురించిన్ని ఏర్పరచుకొన్నవారలయొక్క సద్గుణములగూర్చిన్ని మార్గచూపరి కొన్నివచనములను ఉచ్చరించుదురు.

అటుతరువాత ఏర్పడినవారలు ఆలోచన కర్తలవల్ల బహిరంగముగా పేర్లుపెట్టబడుదురు. అంతట ప్రతివాడును ఏర్పరచుకొనినవారలుతప్ప ఒక చిన్న కాగితముమీద ఏర్పడినవారలపేర్లను రహస్యముగా వ్రాయుదురు. ఆకాగితములనుమడచి ఒకచిన్నపెట్టెలోవేసి ఆపెట్టెను మార్గచూపరిగారిబల్లమీద ఉంచియుండవలెను.

మార్గచూపరి చీట్లనులెక్కించి ప్రస్తుతము ఉన్నవారలసంఖ్యకు సరిగయున్నది, లేనిది చూచుదురు. అప్పుడు మార్గచూపరి ఒక్కొక్కచీటిని బిగ్గరగాచదివి ప్రధానఅధికారికి లేఖకునికి అందిచ్చుదురు.

పిలిచిన పేరులుచొప్పున మార్గచూపరి కుడివైపున ఎడమవైపునచీట్లనుపెట్టి ఎక్కువసంఖ్యగలవారిని ఏర్పచుకొందురు. ఈఏర్పాటు ముగిసినతరువాత లోడాతె అను స్తోత్రసంగీతము పాడుదురు.

ఈఏర్పాటులో జరిగిన సంగతులు చెప్పబడిన మాటలు సభవారలు రహస్యముగా యుంచవలెను. తాము ఎవరిపేరున చీటువేసినారో తెలియపరచరాదు.

# 6వ అధ్యాయము.

# ప్రధాన అధికారి అనుసరించవలసిన విధులు.

ప్రధానఅధికారియొక్క ఉద్యోగము ఎంతోముఖ్యమైనది. ఎందుకంటె సభవారలందరు తమవిధులను చక్కగానెరవేర్చుచున్నారాయని, చూచుట వారిపనిగా యున్నది.

1. ప్రతికూటారంభమునకు ముందు ప్రధానధికారి ఆలోచనసభకున్ను కన్యమరియమ్మ పిల్లలకున్ను జరుగబోవు సంగతులగురించి మార్గచూపరికి తెలియపరచుదురు. కూటములో తీయబడిన ప్రతిజ్ఞలు ఏలాగు నెరవేర్చవలెనో మార్గచూపరిని అడుగవలెను.

2. ప్రధానధికారి సభవారలందరియొక్క నడతలమీద గమనించుచుండవలెను. సభవారలనుండి తెలుసుకొన్నతప్పిదములను మార్గచూపరిగారికి తెలియజేయుచుండవలెను.

3. సభవారల తప్పిదములను దిద్దవలసినఅవసరము వచ్చినప్పుడు దయతోను పరస్నేహముతోను దిద్దవలెను. సభలోఎవరోఒకరు తిపర్యాయములు దిద్దుబాటుపొందినతరువాత ఎప్పటివలెయుంటె వారినిగూర్చి మార్గచూపరి ఆలోచనసభవారలతో చెప్పిన తగినశిక్ష విధుంచుదురు.

ప్రతినెల ప్రధానఅధికారి అప్ప్రెంట్లను కూటముచేయించి సభలోనిప్రవేశకులకు కావలసిన నిబంధనలను కన్యమరియమ్మ పిల్లలకు ఉండవలసినపుణ్యముల అభ్యాసమును గురించి సంభాషించెదరు.

4. ఆలోచనసభవల్ల తీయబడిన ఒక్కొక్క ప్రతిజ్ఞ వ్రాతగానియొక్క పట్టీలో వ్రాయబడగా తరువాత మార్గచూపరి సంతకముచేయుదురు.

నెలకొకసారి రూకల లెక్క పుస్తకము సంతకముచేసి సభలోనిజాబితాలను పట్టీలజాగరూకతతో పరీక్షించవలెను.

# 7వ అధ్యాయము

## ఆలోచనకర్తలు అనుసరించవలసిన విధులు.

1. కన్యమరియమ్మ పిల్లలలో మిగులభక్తిపరులను ఇతరులకు సన్మాతృకగా యుండువారలను ఆలోచన కర్తలకుగాను నియమించవలెను.

కన్యమరియమ్మ పిల్లలవల్లను అప్పైరెంట్లవల్లను ప్రవేశములో చీట్లువేయబడినందున తామువారలకు అన్నిటిలో మంచిమాతృకయు దేవరతల్లియెడల గొప్పభక్తియు చూపవలసియున్నది.

ఆలోచనకర్తలు సభయొక్క మేలునిత్తముగా తమకు సాధ్యమైనంతమట్టుకు ప్రధానధికారికి సాయపడవలెను. ఎట్లంటె సభవారలప్రేమగాని, వైరముగాని చూపక వారలగూర్చి వారికి తెలుపుచుండవలెను.

ఆలోచనసభయందు చెప్పబడినదంతయు రహస్యముగా యుంచవలెను. అట్లుఉంచనివారలు ఖండితముగా శిక్షింపబడుదురు. వెల్లడిచేసినయెడల గొప్పనష్టము కలుగవచ్చును. కన్యమరియమ్మ సిల్లలలో చేరలేనివారల తప్పిదముల గూర్చి జోలిపెట్టుకొనుట ఆలోచనకర్తలపనికాదు.

---

# 8 వ అధ్యాయము

# ఆలోచనసభయొక్క క్రమములు

## ఆలోచనసభ కల్పించబడు విధము.

---

1. 1 మార్గచూపరి 2 ప్రధానధికారి 3 యిద్దరునహాయకులు, 4 లేఖకుడు 5 రూకలఅధికారి, 6 ఆలోచనకర్త.

2. సభవారలందరిమీాద అధికారము చెల్లించుటకును సభలోని అన్నిసంగతులను పరిపాలించుటకును ఆలోచనసభకు శక్తి గలదు.

3. ఆలోచనసభలో ఇచ్చినసంగతులు సభవారలవల్ల నిరాటంకముగా వివరించబడినిష్కపటముతో తమఅభిప్రాయములను తెలుపవలెను. రెండు మూాడవవంతుచీట్లు కావలసినప్పుడుతప్ప వేరువిషయములయందు సగముకంటె ఎక్కువప్రియానముతో నెరవేర్చవలెను.

4. ఆలోచనసభికులు ప్రతిజ్ఞచేసినప్పుడు దేవునిమహిమను సభయొక్క మేలునుమాత్రమే చూడవలెను. వారలు మనుష్యుల ముఖప్రీతియు వైరమున్ను లక్ష్యపెట్టగూడదు.

5. ఆలోచనసభలో జరిగినసంగతులుగురించి ఖండితమౌనులుగా యుండవలెను. ఫలానివారికి అని తెలిసినప్పుడు దానిని ఇతరులకు బహిరంగపరచగూడదు.

ఈవిషయములో ఎవరోఒకరుతప్పులోపడిన అట్టివారలు తప్పిదమునకుతగినట్లు శిక్ష విధించబడును. రెండుమూాడువర్యాయములు ఆలాగుననే యుంటే కొంత కాలమువరకు ఉద్యోగమునుండి తప్పించవచ్చును.



# 9 వ అధ్యాయము.

## వ్రాతగాడు అనుసరించవలసినవిధులు.



1. వీరు ఆలోచనసభలో చెప్పబడునవి తీయబడినప్రతిజ్ఞలు, సంగతులు, పట్టీలోవ్రాయుటయేగాక సభవారల ప్రవేశనముగూడా వ్రాయవలెను.

2. ఆలోచన సభఆరంభమున పోయినసారి చెప్పినసంగతులు చదువబడును.

కన్యమరియమ్మ పిల్లలకూటములో ఆలోచనసభవల్ల తీయబడిన ప్రతిజ్ఞలును సభవారలగురించిన్ని తెలియపరచరాదు.

3. కన్యమరియమ్మపిల్లలపేరున్ను ప్రాయమున్ను ప్రవేశించినదినమున్ను వ్రాయబడిన జాబితాపత్రమును లేఖకుడు బహుజాగ్రత్తతో కాపాడవలెను.

కన్యమరియమ్మ పిల్లలుపేరులువ్రాసి గుడిలోపెట్టబడిన చట్టమునుగూడ జాగ్రత్తపుచ్చుకొనవలెను.

4. వేరేపట్టీలుకూడ జాగ్రతపుచ్చుకొని మార్గచూపరి అనుమతిలేకుండ ఎవరికినిచూపించరాదు.

5. ఆలోచనసభవలన సభనుండి ఎవరో ఒకరిని పంపివేయబడినవార్ల పేరు జాబితానుండిన్ని చట్టమునుండిన్ని తీసి

చేయబడును. గాని వారు వెళ్లిపోయిన కారణముగూర్చి మాట్లాడ అగత్యములేదు.

6. ఏర్పాటునకుముందుగా ప్రవేశకులు ఎందరుంటె అన్ని కాగితపుముక్కలు చించి ప్రతికాగితపుముక్క సమముగాయుండి నాలుగుమడతలుగా పెట్టవలెను ఏర్పాటున మయములోనే పంచవలెను.

7. వ్రాతకుడు ఉద్యోగమును విడువదలచియుంటె సభలోనివట్టీలను యితరపత్రములను ప్రధానఅధికారికి యిచ్చి వారిస్థానమును పొందినవారికి చెప్పవలసిన వివరణలన్ని తెలుపవలెను.

8. వీరు తనఉద్యోగమును బహుశ్రద్ధతో జరుపుచుండవలెను. ఎందుకంటె అశ్రద్ధగాయుంకిన సభయొక్క వృద్ధిని ఆటంకపరచుటకు కారణము కావచ్చును.

---

# 10 వ అధ్యాయము.

## రూకలఅధికారి అనుసరించువిధులు.

---

1. ఆలోచన సభవార్లలోనుండి ఏర్పచ్చుకోనబడిన ఆసభ మాత్రమె ఈఉద్యోగమునకు నియమించవలెను.

2. ఈఉద్యోగములో ప్రవేశించగానే సభలోని మూలధనమును, ఖర్చు, జమను ఏస్థితిలో యుంచవలెనో పరీక్షించవలెను.

3. సభకు సంబంధించిన వస్తువులు మొదలైనవన్నియు ఒకపత్రికలో వ్రాయబడే నారికి ఇవ్వబడగా వాటినిమిక్కిలి జాగ్రత్తగా కాపాడవలయును. కొన్నివాటిని అమ్మినవాటినిగురించి లెక్కవ్రాసియుంచవలెను. సభకుకావలసిన చిన్నరాబళ్లను తమశక్తికొలది కాపాడుటకును ముఖ్యముగా వృద్ధియగుటకును ప్రయత్నించవలెను.

ప్రతినెలమొదటి ఆదివారమును ప్రధానచందాగలయందును సభవారలనుండి పొందినసొమ్మునే కాకుండా సభలోలేనివారలనుండి పొందినది సహా జమచేసియుంచవలెను.

4. పొందిన బహుమానములు చేసినఖర్చులుఅన్నియు పత్రములో లెక్కవ్రాసియుంచవలెను.

మార్గచూపరియొక్కయు ప్రధానఅధికారియొక్కయు సెలవులేకుండ ఏదొకఖర్చు పెట్టరాదు.

5. క్రమముయొక్క రెండవఅధ్యాయములో చెప్పబడినవిధముగా తగినకాలములో పూజకు సొమ్ము చెల్లించవలెను.

6. ఉద్యోగము విడువవలసివచ్చినప్పుడు వారిఆధీనములోయున్నదంత ప్రధానధికారికి అప్పగించవలెను. అంతట క్రొత్తగూళలఅధికారికి యివ్వబడును.

# ఓ ఫీసియ్ముం.

## మంత్రమాల జపించుటకు ముందు జపము.

ఏలినరాలా, మీతిరునామమునుపొగడ నానోటిని తెరిపించండి. సకలమైనవ్యర్థ తెలివి, దుర్విచారములనుండి నా హృదయమును పరిశుద్ధపరచండి. నేనీమంత్రమాలను, సరియైనగి మనముతో జపించుటకును, దేవరవారి తిరుసముఖములోనే నడిగెడి మనవులను నై గొనుటకును యేలినవారైన జేసుక్రీసునాధునిగురించి నాబుద్ధికి ప్రకాశమును, మీ దేవస్నేహాగ్నిని దయచేయండిస్వామి. ఆమెన్ జేసు.

ఏలినవారా మీరీభూమియందుండినపుడు ఏవిధమైనతలంపుతో సర్వేశ్వరునికి స్తుతిచెల్లించితిరో ఆతలంపుతో నేనును ఏకీభవించి ఈజపమును మీకు ఒప్పగించుచున్నాను.

### ఉదయస్తోత్రి జపము.

(ఒకరు) కళంకములేని పరిశుద్ధకన్యకయొక్క పొగడింపునున్ను ఆమెయొక్క మేలైననామమును—

(అందరును) నాజింపా సంతోషించిపొగడుదువుగాక.

(*ఒకరు) పరిసుద్ధ ఏలినరాలా, మీామీాకృపగలసహా యమును దయచేయండి—

(అందరు) నిర్మల పరిశుద్ధకన్యకా సకలశతృవులనుండి నన్ను కాపాడండి—;

(ఒకరు) పితాకును, సుతునికిని స్పిరితుసాంతుకుని స్తో త్రము కలుగునుగాక?—

(† అందరు) ఆదియందుండినట్లు ఇపుడును ఎపుడును అనాది సదాకాలముస్తోత్రము కలుగునుగాక(1)

—ఆలేలూయా—

* ఈగురుతు మొదలుకొని † ఈగురుతువరకును గలజవములను ఆయాగణిత జపమునకుముందు చెప్పేది:—

(1) ఇదివిభూది పండుగకుముందు వచ్చేమూడవఆదివారమునుండి స్వామిఉత్తాన పండుగకుముందుదినమువరకు అల్లెలూయాఅనిచెప్పుటకు బదులుగా: నిత్యమహిమకురాజైన ఏలినవారా! మీాకే స్తోత్రము కలుగునుగాక అని చెప్పేది.

## సంగీత జపము.

భూలోకమునకు ఏలినరాలా, వర్ధిల్లుము! పరలోకమునకు ప్రకాశముగలరాజ్ఞీ వర్ధిల్లుము! కన్యకలలో మేలైన కన్యకా వర్ధిల్లుము ! చల్లని ప్రకాశముగల నక్షత్రమా వర్ధిల్లుము.

దేవానుగ్రహమువల్లను. దివ్యప్రకాశమువల్లను, నింప బడి భూలోకమునకు ప్రాతఃకాల వెలుగువలె నున్నారు. ఏలినరాలా! త్వరితముగా వచ్చి చేయిచ్చి పాపమునుండిని మమ్ము కాపాడండి.

భూలోకమునకు మేలైన యేలినవారు తమయేకకుమారుడైన వార్తయైనవారివల్ల భూమినిని సముద్రమునను, వరుసలు వరుసలుగల నక్షత్రములనను కలిగించి ఆయేకపరిశుద్ధవార్తయైన పుత్రునికే మిమ్మును సదాకాలమునకును తల్లిగా నియమించి సర్వేశ్వరుడు నేరస్థుడైనఆదాము సంతతి యొక్క పాపమునుండి మమ్ము దొలగించి తమకు ప్రియరాలుగా మిమ్మును తెలుసుకొనిరి.

(ఒకరు.) మానవసంతతి మాలిన్యమగుటకు ముందు ఈ పరమనాయకిని సర్వేశ్వరుడు తెలుసుకొనిరి.

(అందరు.) ఆమెను తమఆలయమునందు వాసముచేయ జేసిరి.

(*ఒకరు) ఏలినరాలా! నామనవినివిన నవదరించండి.

(అందరు) నాఅభయ శబ్దము మీసన్నిధివరకు వచ్చును గాక—

ప్రార్థించెదము.

అర్చ్యశిష్టమరియమ్మా! ఎవరిని చేయివిడువనివారును త్రోసివేయనివారునైన మాతృరాజ్ఞీ! మాయేలినవారైన జేసుక్రీస్తునాథుని తల్లియైనవరా! భూలోకమునకు ఏ

లినవతీ. మీకృపాదృష్టితో నన్ను వీక్షించి నాపాపము లన్నిటికి ఓర్పుదయచేయునట్లు మీప్రియకుమారుని యొద్ద ప్రార్థించండి. ఇపుడు మీనిష్కళంకోద్భవమును మిగులభక్తితో కొనియాడుటవల్లను కన్యకయైనమీరు కనినవారును ఏకత్రిత్వముతో పరిపాలనము చేయువారునైన జీవితులును రాజ్యపరిపాలకులునై యుండు జేసు క్రీస్తునాధుని కృపవలన నిత్యభాగ్యమైన సంభావనను యొక పొందుదునుగాక. ఆమెన్ జేసు.

(ఒకరు) ఏలినరాలా! నాప్రార్థనను వినవధరించండి.

(అందరు.) నాఅభయశబ్దము మీసన్నిధివరకు వచ్చును గాక.

(ఒకరు) ఏలివారిని స్తుతించుదుముగాక.

(అందురు) సర్వేశ్వరునికి పొగడింపు కలుగునుగాక.

(ఒకరు) మృతిపొందిన విశ్వాసులయొక్క ఆత్మలు సర్వేశ్వరునికృపవలన సమాధానమునయు. విశ్రమించ బడునుగాక.

(అందరు) ఆమెన్ జేసు. *

* ఈగురుతుమొదలుకొని † ఈగురుతుపరకుగల జపములను ఆయాగి.శితము జపమునకు తరువాత చెప్పవలసినది.

మొదటిగణితము.

(ఒకరు) పరిశుద్ధపలినరాలా మీకృపగల సహాయమును దయచేయండి.

(అందరు) నిర్మల పరిశుద్ధ కన్యకా! సకలశత్రువులనుండి నన్ను కాపాడండి.

(ఒకరు.) పితాకును, సుతునికిని, స్పిరితుసాంక్తుకును, స్తోత్రముకలుగునుగాక.

(అందరు) ఆదియందుండినట్టు ఇపుడును ఎపుడును అనాది సదాకాలమును స్తోత్రముకలుగునుగాక.

—:సంగీత జపము:—

జ్ఞానముగల కన్యకా! వర్ధిల్లుము. ఉచితముగా ఆశీర్వదింపబడినతల్లీ! సర్వేశ్వరుడు వాసముచేయుటకు పరిశుద్ధముగా కట్టబడినమందిరమా! అత్యున్నతముగా చిత్రింపబడిన ఏడు సౌందర్యస్థంబములచేత అలంకరించబడినదానా!

భూమిమీద విధించబడిన శాపమునుండి తప్పించబడి మీఘుణతి వహించిన జన్మమునకుముందే పరిశుద్ధమును పవిత్రమునుగలవారుగా నుండిరి, జీవితులయొక్కతల్లీ! పరిశుద్ధముగా ప్రవేసించువాకిలీ! జాకోబను వారియొక్క నవనక్షత్రమా! సన్మన్సులయొక్క మహిమయైన రాజ్ఞీ! కనుపరెడు వరుసలు తీర్చబడిన వల్లభముగలసేనలవలె భయము రప్పించతగినదానా! క్రీస్తు

వుల హృదయములనుండి భయమంటిని పారదోలిమా శరణముగాను మావిశ్రమముయొక్క రేవుగాను యుండండి.

(ఒకరు) ఆమెనువారు పరిశుద్ధముగా కలిగించిరి.

(అందరు) వారు ఆమెను సకలశ్రృష్టింపులకు పైగా హెచ్చించిరి.

(ఒకరు) ఏలినరాలా? నాప్రార్థనను విన నవధరించండి.

(అందరు) నాఅభయశబ్దము మీసన్నిధివరకు వచ్చునుగాక.

## మూడవ గంభీరజపము

(ఒకరు) పరిశుద్ధ ఏలినరాలా. మీకృవగల సహాయమును దయచేయండి.

(అందరు) నిర్మలపరిశుద్ధకన్యకా సకలశత్రువులనుండి నన్ను కాపాడండి. సంగీత జపము.

వాగ్ధిత్తముయొక్క పెట్టె, సలోమోన్‌రాయొక్క ఉన్నత సింహాసనమా! భయోత్పాతముగల మానవులకు కనపరచబడిన నమ్మకముయొక్క గగనవిల్లా, శోభనముగల దర్శనముయొక్క దట్టమైన వనమా. ఆరోనుయొక్క సౌందర్యమైన చేతికర్రా క్రీర్తి పొందిన జెదియోన్‌యొక్కతుల్యకంబళమా! సర్వేశ్వరునియొక్క తెరవబడినవాకిలీ! సాంసోనియొక్క మధురమైన తేనెగూడా! మేము సర్వేశ్వరునికి మధురమైన సుగంధవాసనగా

యుంచునట్లు వేడుకొనుము. నిర్మలపరిశుద్ధకన్యకా నిర్భా
గ్యస్థితియైన పాపమాలిన్యముగల హేవనంతతియొక్క దో
షమునుండి ఎడబాపబడినతల్లీ! నిత్యపితయొక్క యేక
సుతుడైన మీదివ్యకుమారుడు ఎంతసత్ప్రాశమైన వా
రుగానున్నారు. మిమ్మును సకలపాపమాలిన్యమునుండి యె
డబాపునట్లు విశేషఅనుగ్రహమును మీనిమిత్తము ఏ
ర్పరచియుంచిరి.

(ఒకరు) ఉన్నతస్థలమునందు నేను వేంచేసి యున్నాను.

(అందరు) మాసింహాసనము మేఘమండలముయొక్క స్థం
బములోనున్నది.

(ఒకరు) ఏలినవారాలా నాప్రార్థనను విననవధరించండి.

(అందరు) నా అభయశబ్దము మీసన్నిధివరకు వచ్చును
గాక.

## ఆరవ గణితజపము.

(ఒకరు) పరిశుద్ధ ఏలినవారాలా మీకృపగల సహాయము
ను దయచేయండి-

(అందరు) నిర్మలపరిశుద్ధ కన్యకా సకలశత్రువులనుండి మ
మ్ము కాపాడండి-

### సంగీత జపము.

మహాశకనికరము నిండిన యేలినవారియొక్క కన్యాతల్లీ!
ఆరాధనకు అర్హమైన త్రిత్వముయొక్క ఆలయమా
వర్ధిల్లుము. సన్మనస్కులయొక్క సంతోషమా! వర

శుద్ధత్వముయొక్క సొగసైన ఆలయమా? కష్టసంకట
ములలో నుండువారల సంస్థానమునకు ఆరుదలను గొ
నివచ్చుచున్నారు, కలంకములేని ఇంపము నొసగువన
మా? ఓర్పుయొక్క జయమోవా? విరక్తత్వముయొ
క్క వృక్షమా, పశ్చాత్తాపముగల పాపాత్ములయొ
క్క తైలమా?

వాగ్దత్తముయొక్క నిలయమా? గురుత్వమునకు తగిన
భాగ్యమా జన్మపాపమలినమునుండి తొలగింపబడిన పరిశు
ద్ధవతీ? దేవునియొక్క నగరా, మహాఉన్నతవతీ, తూర్పు
దిక్కువాకిలీ? అత్యంతకృపనిండినదానా? మిమ్మే పొగడి
కొనియాడుచున్నాము. మహాఅతిశయముగా ఆశీర్వదింప
బడిన నిష్కళంకకన్యకా? మీపక్షపరా మరికగల ఆదరు
వునందు మేము శరణుజొచ్చుచున్నాము.

(ఒకరు) ముండ్లచెట్లలో లీలీ పుష్పముండులాగు,

(అందరు) ఆదాముయొక్క కుమార్తెలలోగా నాప్రియు
రాలుగా యున్నది.

(ఒకరు) ఏలినరాలా నాప్రార్థనను విన నవధరించండి.

(అందరు) నాయభయశబ్దము మీసన్నిధివరకు వచ్చును
గాక.

తొమ్మిదవ గణితజపము.

(ఒకరు) పరిశుద్ధ ఏలినరాలా!

(అందరు) మాశరణుగల నగరా! వర్ధిల్లుము. దావీధురాయొక్కయుప్పరిగా! వారవల్లభముగలసేనాసమూహామువల్లను జయధ్వజములవల్లను అలంకరింపబడినదానా వర్ధిల్లుము.

అనుగ్రహమును కరుణయును నిండినతల్లీ! భయమును క్షేమమును అనుభవించు పాపాత్ములమైన మేము మీగర్భయుత్పత్తియైననిర్మలస్నేహాజ్వాలలవలన రగిలింపబడి మిమ్ము జూచి పరుగు బారివచ్చుచున్నాము. నాగచరమైన పిశాచి మీవలన అపజయమొందినది. యుద్ధగువారమందు భయపడని జూదిత్తను నామెవలె పరాక్రమముగల క్రియలచేత ఎచ్చటను కీర్తివహించిన స్త్రీ సౌందర్యముగల ఒకకన్యకవలన వయస్సుమించిన దావీదను వారు పోషించబడినలాగు నిత్యసుతుడైన సర్వేశ్వరుడు మీపరామరిక చేత పోషింపబడిరి.

రాఖేలను నామె ఏజిప్తు దేశపు పోషకునికనినలాగు మీరును స్తుతింపతగిన ఒకరక్షకుని ఈప్రపంచమున కిచ్చితిరి.

(ఒకరు) నాప్రియరాలా, నీవు పూర్ణసౌందర్యవతివి.

(అందరు) జన్మపాపముయొక్క కళంకము మీయందు ఒకప్పటికిని ఉండినదిలేదు.

(ఒకరు) ఏలినరాలా నాప్రార్థనను విన నవధరించండి.

(అందరు) నాఅభయశబ్దము మీసన్నిధివరకు వచ్చుగాక.

ఎస్ పెర్ అను సాయంకాలజపము.

(ఒకరు) పరిశుద్ధ ఏలినరాలా మీకృపగల.........

(అందరు) నిర్మలపరిశుద్ధకన్యకా సకల శత్రువులనుండి నన్ను కాపాడండి.

సంగీత జపము.

సూర్యసంచారముయొక్క పది రేఖలు వెనుకకు వచ్చిన అభాసను వానియొక్క సూర్యగడియారమూ నిర్మలపరిశుద్ధకన్యకయొద్దనుండి వార్త యైనదేవుడు అవతరించిరి. మట్టుప్రమాణములేనిదేవుడు తాము కలిగించిననమ్మనస్కుల కంటె అధికముగా తగ్గి మానవరక్షణ్యము సంతతిని యిచ్చి మానవజాతికి మోక్షమును సంపాదించిపెట్టిరి.

మరియమ్మా మిమ్మును చుట్టుకుని పరమప్రకాశముయొక్క నీతిగల సూర్యుడు తమజ్యోతికిరణములను వీచ మీరు మీగర్భఉత్పత్తిచేత వారి దేవప్రకాశమును గొని ప్రాతఃకాలమువలె చల్లని ప్రకాశముగలవారై యున్నారు.

సర్పముయొక్క జయశీలీ? ముండ్లచెట్లలోగా లీలీయను పుష్పమువలె ప్రకాశమానమై చంద్రునివలె యున్నారని సమస్త వర్ణింపులును మిమ్మునుగూర్చి వర్ణించుచున్నవి.

(ఒకరు) గగనముయొక్క మారనిప్రకాశమును ఉదయింపజేసితిని.

(అందరు) భూమియంతటను మూఢమంచువలె మూసితిని.

(ఒకరు) ఏలినరాలా! నాప్రార్థనను వినవధరించండి.

(అందరు) నాఅభయశబ్ధము మీసన్నిధివరకునువచ్చుగాక. కడపటివేడుదల.

(ఒకరు) ఏలినరాలా! మీరుమానిమిత్తము వేడుకొను వేడదలవల్ల మీకుమారుడైన జేసుక్రీస్తుయొక్క కోపము తగ్గి మమ్ము క్షమపరచుదురుగాక.

(అందరు) వారుమామీదగల తమకోపమును మార్చుదురుగాక.

(ఒకరు) పరిశుద్ధఏలినరాలా! మీకృపగల,.........

(అందరు) నిర్మలపరిశుద్ధకన్యకా సకల శత్రువులనుండి నన్ను కాపాడండి.

సంగీతజపము.

శక్తిగలకన్యకా మహాకీర్తిపొందినతల్లీ మహిమప్రకాశ నక్షత్రములవల్ల కిరీటముధరించబడిన సౌందర్యముగలరాజ్ఞీ మోక్షముయొక్క ఉన్నతసింహాసనమున సర్వేశ్వరునికుడి పార్శ్వమునందు నిలువభాగ్యమునుపొంది పీతాంబరమువల్ల అలంకరింపబడినదానా ఏర్పరచబడిన నన్మనస్కులకంటె మహిమయందు హెచ్చికళంకములేని ఆత్మలపరిశుద్ధత్వముగలవారైయున్నారు. కృపయొక్క తల్లీ!సునమ్మికమీయందుకనిపించుచున్నది. మీమునవివలన సర్వేశ్వరుడు పాపాత్ములను విడుదలచేయుదుడు. చల్లనిపరిశాళముగల సముద్ర న

ఛ[త్రమా నావనష్టము పొందినవారల కన్నులను సంతసింపజేయు రేవా తెరవబడినవాకీలియును పాపాత్ముల శరణము నైన మీావలన మేము పరలోకరాజును కని అర్చ్యశిష్టుల మగుదుముగాక! ఆమెన్ జేసు.

(ఒకరు) మరియమ్మా మీా నామము చిందిన పరిమళ తైలమగును.

(అందరు) మీా యాడిగస్తులు మిమ్ము మిగుల ప్రేమించియున్నారు. అర్చ్యశిష్టమరియమ్మా ఎవరిని చేయి విడువనివారును తోసివేయనివారునైన మోక్షరాజ్ఞీ మాఏలినవారైన జేసుక్రీస్తునాథుని తల్లియైన వారా భూలోకమునకు ఏలినవతీ మీాకృపాదృష్టితో నన్ను వీక్షించి నాపాపముల కన్నిటికిని ఓర్పు దయచేయునట్లు మీాప్రియకుమారునియొద్ద ప్రార్థించండి. ఇప్పుడు మీా నిష్కళంకోద్భవమును, మిగుల భక్తితో కొనియాడుటవల్లను కన్యకయైన మీాకు కనినవారును ఏకత్రీత్వముతో పరిపాలన చేయువారునైన జీవితులును రాజ్యపరిపాలకులునై యుండు జేసుక్రీస్తునాథుని కృపవలన నిత్యభాగ్యమైన సంభావనను ఇక పొందుదునుగాక.

ఆమెన్ జేసు.

(ఒకరు) ఏలినరాలా నాప్రార్థనను విన నవధరించండి.

(అందరు) నా అభయశబ్దము మీా సన్నిధివరకు వచ్చునుగాక.

(ఒకరు) ఏలినవారిని స్తుతించుదుముగాక.
(అందరు) పర్వేశ్వరునికి పొగడింపు కలుగునుగాక.
(ఒకరు) సర్వావల్లభముగల దయ నిండిన దేవుడైన పితా, సుతుడు, స్పిరీతు సాంతువైనవారు మనలను ఆశీర్వాధించి రక్షించుదురుగాక.
(అందరు) ఆమెన్ జేసు.

సంగీతజపము.

వందనమునకు తగ్గ కన్యకా, మేము సుద్ధతలంపుతో వేదప్రమాణమునకు తగిన ఈగణితజపములను మీకు పాదకాణుకగా పమర్పించుచున్నాము. పేర్మిగల కన్యకా, పరదేశులమైన మేము క్రీస్తునాథుని దర్శించువరకు, మమ్ము ను నడిపించి మరణసమయములో సహాయముగా నుండండి. జన్మపాపగణుపును, కర్మపాపపట్టుదలయును, చేరని శేఖ ఇదే.
(ఒకరు) కన్యకా నీగర్భయుత్పత్తియందు మీరు నిష్కళంకముగా నుండిరి.
(అందరు) మీరు కనినకుమారుని పితయొద్ద మాకొరకు వేడుకొనండి.

ప్రార్థించుదుము.

పర్వేశ్వరా స్వామీ, పరిశుద్ధకన్యకయొక్క కళంకము లేని గర్భఉద్భవముచేత మీకుమారునికి యోగ్యపీఠము గా ఆమెయుండ చిత్తమైతిరే, ముందు నియమించిన మీ

తిరుకుమారునియొక్క మరణమువల్ల ఆమెను సకలపాపము లినమునుండి రక్షించినలాగు మేమును పావమలినములేక మీరాయొద్దకురాను, ఎప్పుడును మీతోను స్పిరితుసాంక్తువుతోను, ఏకసర్వేశ్వరుడుగానుండి, రాజ్యభారముచేయు మీతిరుకుమారుడైన జేసునాధస్వామి మీతిరుముఖమును జూచి మీరుమాకనుగ్రహాము దయచేయువలయునని మిమ్ము ప్రార్థించుచున్నాము. ఆమెన్ జేసు.

(ఒకరు) అర్చ్యశిష్ట కన్యమరియమ్మగారి కళంకములేని గర్భఉద్భవము,

(అందరు) మాశరణముగాను, కావలిగాను యుండునుగాక. ఆమెన్ జేసు.

మంత్రమాల ముగిసినపిమ్మట జపము. మహాపూజింపతగిన ఏకత్రిత్వమునకును స్లీవలో కొట్టబడిన ఏలినవారైన జేసుక్రీస్తునాథుని మనుష్యత్వమునకును ఒడ్డోలగ గణితవహించి ఒక నాటికిని కన్యమహిమ చెడని ముక్తిభాగ్యము పొందిన మరియమ్మయొక్క కొరతలేని కన్యత్వమునకును, సకల అర్చ్యశిష్టుల కూటమునకును, సకలసృష్టింపులవలన స్తుతియును, స్తోత్రమును మహిమయును, పొగడ్తయును సదాకాలమును కలుగునుగాక, మనకోయనిన సదాకాలమును, పాపవిమోచనము కలుగునుగాక, ఆమెన్ జేసు.

(ఒకరు) నిత్యపితయొక్క సుతునిమోసిన కన్యమరియమ్మయొక్క ఉదరము భాగ్యముపొందినది.

(అందరు) ఏలినవారైన క్రీస్తునాథుడు గోరిలిన స్థన్యములు భాగ్యము పొందినవి.

దేవరతల్లి సమర్పణజపము.

మిక్కిలి పరిశుద్ధకన్యకా, పరలోక భూలోకములకు గొప్పరాజ్ఞీ మాహృదయమంతటితో మీకు మహిమ గౌరవములు చెల్లించుటకు మీపాదాలఎదుట సాష్టాంగముగా పడుచున్నాము. మీయొక్క నిష్కళంక జన్మమును సన్మానించుటకును మీయెడల ప్రేమయును కృతజ్ఞతయును చూపుటకును మమ్మందరినిసదామీకొప్పగించుచున్నాము. మానైన స్త్రీపురుషులను, తలిదండ్రులను వృద్ధులు, బలహీనులు, బీదలను, అనాథులను, మాకుటుంభములను, స్నేహితులను, మావిచారణలో యున్నవారలను మీకొప్పగించెదము. మాసంతోష, దుఃఖములు, పనులు మాయాత్మశరీరములను, మాజీవితకాలమంతయు మాకడశ్వాసమును మీకు సమర్పించుచున్నాము.

ఓనిష్కళంకమాతా, ఈగొప్పసమర్పణను అంగీకరించి మేము పాపము తప్పించి పుణ్యముచేయుటకును, పరిశుద్ధముగా జీవించి మృతిపొందుటకును, వీరియొక్క దివ్యకుమారుని తిరుహృదయాన్నుగహమును దయచేయుదురుగాక. ఆమెన్ జేసు.



కన్యారాజ్ఞి సభలోచేరువారలు ఇచ్చు వాగ్దత్తము.

గురువు—కుమారుడా, యెందునిమిత్తము కన్యమరియమ్మ యొక్క పీఠము దగ్గఱకు వచ్చితివి?

కుమారుడు—తంఁడ్రిగారా, కన్యమరియమ్మ యొక్క సభలో చేరుటకు అధిక ఆశతో వచ్చియున్నాను.

గురువు—కుమారుడా, ఇందులో ఇమిడియుండే విధులన్ని విశ్వాశముతో అనుసరించుటకు ప్రియాశపడుతావా?

కుమారుడు—అవునుస్వామి ఈవిధులన్ని నాకు బాగా తెలియును, దేవునిసహాయముచేతను, దేవమాతయొక్క అనుగ్రహమువల్లనున్ను వాటిని విశ్వాశముతో అనుసరించుటకు రోజునోజు ప్రయాశపడుతాను.

గురువు—కన్యమరియమ్మ సభవార్లయొక్క క్రమములున్ను, భక్తిగల అభ్యాసములున్ను బాగుగా అనుసరించుటకు వాగ్ధత్తము ఇచ్చుచున్నావా?

కుమారుడు—అవును స్వామీ, కన్యమరియమ్మ చేసినవిధముగా వాటినన్నిటిని అనుసరిస్తాను,

గురువు—కుమారుడా, కన్యమరియమ్మ సభవార్లకు ఉండవలసిన ముఖ్యపుణ్యములగు విరక్తత్వము దీనత్వము విధేయత్వము పరస్నేహము సంపాదించుటకు వాగ్ధత్తము చేయుచున్నావా?

కుమారుడు—అవునుస్వామి, పరిశుద్ధ కన్యమరియమ్మవతె

ఈపుణ్యములను అనుసరించుటకు ప్రయాశ పడుచు
న్నాను.

గురువు—కుమారుడా నీయొక్క యాశలున్ను మంచినడ
వడికలున్ను చూచి కన్యమరియమ్మయొక్క సభలో
నిన్ను చేర్చుకొనుచున్నాను. నీవుచేసిన వాగ్దత్తములు
అందరికి తెలియునట్లు నీహృదయసమర్పణజపము, జ
న్మపాపములేక యుద్భవించిన మరియమ్మకు జెప్పుము

I. స్వరూపము ఇచ్చునప్పుడు:—ఈసభలో చేరినవార్ల
కు గురుతుగా ఈస్వరూపమున్ను, రిబ్బనున్ను, పుచ్చు
కొనుము.

II. పుస్తకమిచ్చునపుడు:— ఈ కన్యమరియమ్మయొక్క
సభలో వాడుకప్రకారము పుస్తకము పుచ్చుకొని అం
దులో వ్రాసినప్రకారముగా, విశ్వాసముతో ప్రతిదిన
ము నడుతువుగాక. ఆమెన్ జేసు.

స్వరూపమిచ్చునప్పుడు:—ఈస్వరూపమును భక్తితో
ధరించుకొని నీయొక్కమంచినడతవల్ల కన్యమరియమ్మ
యొక్క బిడ్డవని చూపించుము.

# సమర్పణము. (ఆన్ పైరెంట్లు)

మీసభలో ఆన్ పైరెన్ట్లుగా చేర్చబడినామని సం
తోషముపొంది మీపీఠము దగ్గఱ సాష్టాంగముగాబడి పా
పములేక యుద్భవించిన మరియమ్మా
మీపిల్లలసభలో చేరడానికి నాకు ఎంత అభిలాషయు

న్నదో అటువంటిదయ నాకు గలిగినట్లు మాధుర్యమైన తల్లీ, నెనరుగల తల్లీ, మీసముఖమున మీపిల్లలకుఉండవలసిన పుణ్యములను సంపాదించుటకును అటుమీద నాభక్తి చేతను స్నేహముచేతను విధేయత్వముచేతను నాసహోదరులకు మంచిమాతృకయై యుండుటకును నానింముభలముతో ప్రయాశపడి గట్టిమనస్సుతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.

అయితే ప్రియమైనతల్లి నాకు భలమును స్థిరమును లేదని మీకు దెలిసియేయున్నది. నాభలముగల పాలకురాలా నాసహాయమునకు రండి. నీప్రియకుమారుని ప్రార్థించుకొని నేను యిచ్చిన ఈమంచిప్రతిజ్ఞలను మరువక, వాటినిసరిగా ననుసరించులాగు కావలసినసహాయమును నడగండి. నాజీవితకాలమంత వాటిని అనుసరించి ఈయిహమందును పరమందును మీయొక్క ప్రియమైన కుమారుని యగుదునుగాక.

జ్ఞానఫలవివరణ.

1. చావైన పాపముశుద్ధమును, దానినరకయాజ్ఞను, పశ్చాత్తాప దేవద్రవ్యానుమానముచేతను, నివారణమగుచున్నవి.

2. అనిత్యశిక్షను ఇహమందైనను, ఉత్తరించుస్థలమందైనను యనుభవించవలెను.

3. జేసునాథుడు, దేవాంబ మొదలగు అర్చ్యశిష్టుల

పరిహారఫలములో తిరుసభ మనకు పాలివ్వగలదు. "నీవు ఈలోకములో విప్పునదంత, పరలోకములోను విప్ప బడును"

4. మనము కర్తు నియవయవముగనుక, వారియు, వారి అవయవములగు అర్చ్యసిష్టులయు మేలులు మనకు ప్రయోజనముగా యుండవలెను.

5. వారి పరిహారఫలములను, కొన్నిజపాల చెల్లింపు మూలముగా, తిరుసభ మనకు యొసగుచున్నది.

6. పరిపూర్ణ ఫలమంటే: అనిత్యశిక్షయొక్క పూర్ణనివారణము.

7. చిర్లరఫలమంటే: నిత్యశిక్షయొక్క కొంతభాగ నివారణము.

8. ఇన్నిదినాలఫలమంటే: పూర్వోకపు అన్నిరోజుల జపతపముచే అయ్యే ఉత్తరింపుఫలము.

9. ఉత్తరించుయాత్మలకు ఈఫలముల నొప్పగింప తిరుసభ ఉత్తరు విచ్చుచున్నది.

ఫలములనొంద మూడువిశేషములు.

i ఆత్మస్థితి.

1. ఫలమును బొంద ఆత్మము చావైన పాపరహితముగా నుండవలెను.

2. పరిపూర్ణఫలముబొంద స్వల్పపాప యారోచింపు గావలయును.

## ii తలంపు.

1. పాపుగారు కల్పించిన యభిప్రాయము ననుసరించు తలంపుగావలెను.

2. పైతలంపు మాటిమాటికి అక్కఱలేదు. ఫలదినాధిసంఖ్య నెరుగనవసరములేదు.

3. పాత్తు తలంపు చాలును. ప్రతిరోజు నూతనింపు మంచిది.

4. ఎవరికొరకు కొప్పగించేదనిన్ని తీర్మానముండవలెను.

## iii కట్టడలు.

1. వాటిని, నియమితకాలమునను, విధమునను, దుఃఖహృదయముతోను చెల్లించవలెను.

2. పరిపూర్ణ ఫలమొందు సాధారణముగా పాపసంకీర్తనము దివ్యభోజనము, గుడిసందింపు, పాపుగారితలంపుకొరకు వేడుదలయగు నాలుగు కావలయును.

3. వారి ఫలములన్ని బొందు చాపైన పాపములేనివెడల 15 దినముల కొకసారి పాపసంకీర్తనము చాలును.

4. పలుపరిపూర్ణఫలములను బొందు ఒకదివ్యభోజన పరిగ్రహింపు చాలును.

5. గుడిసందింపు, పాపుగారికొరకై వేడుట, ఎన్నిఫలములో యన్నిమార్లు చెల్లింపవలెను.

6. పాపుగారితలంపు యేమనగా, తిరుసభ యనుకూల

మహిమ విశ్వాసయాపకము, పతితమార్గహతము, క్రీస్తు రాజుల సమాధానము. పాపుగారి యారోగ్యము.

7. పైతలంపులవింగడింపు నక్కరలేదు. వారితలంపు నెరవేర్పునకని ప్రార్థింపుదల చాలును.

సంగమువారు బొందగల పరిపూర్ణ ఫలములు.

1. తమ పాపములకై నిజమైన మనస్తాపముతో, పాపసంకీర్తనముచేసి దివ్యసత్ప్రసాధము దీసినట్టయితే కూటములో చేరినరోజు ఒక పరిపూర్ణ ఫలము నొందగలరు.

2. మరణసమయములో నొకటియు (3) స్వామిపుట్టినదినమున, జేసునాథస్వామి మోక్షారోహణ పండుగనాడు, జన్మరాజ్ఞీపండుగనాడు, కన్యమరియమ్మ పుట్టినపండుగనాడు, మంగళవార్త పండుగనాడు, దేవరతల్లి మోక్షమున కెత్తబడిన పండుగనాడు, ఈదినములలో సత్ప్రసాధము దీయుటచే నొకటియు, (4) మార్గచూపరివల్ల నియమించబడిన ప్రతిసారి కూటమున కెళ్ళేటప్పుడెల్ల సత్ప్రసాదము దీసినను, సభకై ఏర్పర్చబడ్డ గుడినిసందించి, పాపుగారి తాత్పర్యమునకును జపించినయెడల నొక పరిపూర్ణఫలమును (5) ఈసభవారు సభ నియమించిన స్థలమున, లేక వేరొక గుడిని దర్శించి ప్రార్థనతో, దివ్యసత్ప్రసాధములొ కొన్నయెడల సంవత్సరమునకు రెండుసార్లు పరిపూర్ణఫలము గలుగును. (6) దేవరతల్లి పుట్టినపండుగ ఈసభలో ముఖ్య

మైనది. ఈదినము గుడిని నందించి సత్ప్రసాధము దీసిన నొకపరిపూర్ణఫలము. (7) ఈసభ వారలు 10 దినములుగాని 7ది. గాని 6ది. గాని అజ్ఞాతవాసము చేసినందువలనను యొక పరిపూర్ణఫలము. (8) సభలోని కాయలావారిని మార్గ చూపరి సందించిన ప్రతిసారిన్ని ఆయనవల్ల కొన్ని సద్బు ద్ధులను పొందినను దివ్యసత్ప్రసాదములో కాని పావుగారి తాత్పర్యమునకుగాను 8 జ్యో. 3 ప్ర. త్రీత్వ. వేడుకొన్నను నొకపరిపూర్ణఫలము గలుగును.

## అసంపూర్ణఫలము.

ఈదిగువ జెప్పబోవు కార్యములను అనుసరించే సందికు లకు 7 సంవత్సరములు అసంపూర్ణఫలముగలుగును.

1. తిరుసభలో విశ్వాసునియొక్కగాని, ఈసభలోని యేదొకరు చనిపోయినను యాపేక్షతముతో సమాధివరకు వెంబడించే టందుచేతను,

2. భక్తితో ఈసంగము గుడిలోయుండి గురువుల ప్ర సంగము వినుటచేతను,

3. వారములో ప్రతిసారి పూజకినుటచేతను,

4. ప్రతిదినము యాత్మశోదన జేసినందుచేతను,

5. ఈసభ వారిలను దర్శించినను, లేక కాయలావారిని బీదవారిని పరామర్శించుటచేతను,

6. విరోధులను సమాధానపరుచుటచేతను, అసంపూ ర్ణఫలము లొందగలరు.

## దేవమాతప్రార్థన.

స్వామి కృపగా నుండండి
క్రీస్తువా కృపగా నుండండి
స్వామి కృపగానుండండి
క్రీస్తువా మాప్రార్థనవిన నవధరించండి
పరలోకమందుండెడు పితయైన సర్వేశ్వరా
లోకము రక్షించిన సుతుడైన సర్వేశ్వరా
ఇస్పిరితు సాంతువైన సర్వేశ్వరా
పరిశుద్ధత్రీత్వముగా నుండె ఏకసర్వేశ్వరా
అర్చ్యసిష్ట మరియమ్మ
సర్వేశ్వరునియొక్క అర్చ్యసిష్టమాత
కన్యకలలో అర్చ్య-కన్యక
క్రీస్తువుయొక్క మాత
దేవిష్టప్రసాదముయొక్క మాత
మహాపరిశుద్ధమాత
మహావిరక్తిగానుండెడుమాత
నిర్మలమయిన మాత
కన్యశుద్ధము చెడనిమాత
స్నేహమునకు దగినమాత
హాశ్చర్యమునకు దగినమాత
సృష్టకునిమాత

మాకు దయచేసి రక్షించండిస్వామి.

మాకొరకుగాను వేడుకొనండి.

రక్షకునిమాత
మహావివేకముగల కన్యకా
మహా పూజ్యమైన కన్యకా
స్తుతింపబడ్డ యోగ్యమైనకన్యకా
శక్తిగల కన్యకా
దయగలకన్యకా
విశ్వాసముగల కన్యకా
ధర్మముయొక్క అద్దమా
జ్ఞానముయొక్క ఆలయమా
మాసంతోషముయొక్క కారణమా
జ్ఞానాపాత్రమా
మహిమకుదగిన పాత్రమా
అత్యంతభక్తియొక్క పాత్రమా
దేవరహస్యముగల గోజపుష్పమా
దావీదురాజుయొక్క గోపురమా
దంతమైమైన గోపురమా
స్వర్ణమైమైన హాలయమా
వాగ్దత్తముయొక్క పెట్టె
మోక్షముయొక్క వాకిలీ
ఉదయకాల నక్షత్రమా
వ్యాధిగ్రస్థులకు ఆరోగ్యమా
పాపాత్ములకు శరణమా

మాకొరకుగాను వేడుకొనండి.

కష్టపడేడు వారలకు ఆదరువా
క్రీస్తువులయొక్క సహాయమా
సన్మనస్సులయొక్క రాజ్ఞీ
పితాపిత్రులయొక్క రాజ్ఞీ
దీర్ఘదర్శులయొక్క రాజ్ఞీ
అపోస్తులయొక్క రాజ్ఞీ
వేదసాక్షులయొక్క రాజ్ఞీ
స్తుత్యులయొక్క రాజ్ఞీ
కన్యస్త్రీలయొక్క రాజ్ఞీ
సకల అర్చ్యశిష్టులయొక్క రాజ్ఞీ

మాకొరకు వేడుకొనండి.

జన్మపాపము లేక యుద్భవించినరాజ్ఞీ
మహా పరిశుద్ధ జపమాలరాజ్ఞీ
సమాధానముయొక్క రాజ్ఞీ

లోకముయొక్క పాపములను పరిహారించెడు సర్వేశ్వరునియొగ్క దివ్యగొఱ్ఱెపిల్లయైన జేసువా,

మాపాపములను ఓర్వండి స్వామి,

లోకముయొక్క (మొదలయినవి,)

మేమున్ను, జేసుక్రీస్తునాథుని దివ్యవాగ్దత్తములకు మేము పాత్రులమగునట్టు.

సర్వేశ్వరునియొక్క పరిశుద్ధమాత మాకొరకుగాను వేడుకొనండి.

ప్రార్థించుదుము.

మాయేలినవారైన సర్వేశ్వరా, మాహృదయములోను, శరీరములోను, మేము సదాసౌఖ్యము ననుభవించులాగును, నిత్యకన్యకయైన అర్చ్య-మరియమ్మ ప్రతాపచనువువల్ల ఇప్పటి దుఃఖదురితమునుంచి మేము విడుదలయియి నిత్యానందమనుభవించేలాగును కృపచేయ మిమ్ము మనవిచేయుచున్నాము. మాయేలినవారైన జేసుక్రీస్తునాథుని తిరుముఖమును జూచి వీటిని మాకు పాలించండి.

ఆమెన్ జేసు॥

జన్మపాపములేక యుద్భవించిన మరియాయనుజపము.

జన్మపాపములేక యుద్భవించిన మరియమ్మా పాపులకు శరణమా, ఇదిగో పరుగెత్తి వచ్చి మీశరణు జొచ్చితిమి. మామీద నెనరుగానుండి మాకొరకు మీదివ్యకుమారుని వేడుకొనండి. (మూడుసార్లు) జ్యోతి॥ ప్రియ॥ త్రిత్వ॥

సత్ప్రసాద జపము.

| | |
|---|---|
| 1. ఓసాలూతారిస్ హొస్తియా, | 1. రక్షకరఅప్పమా. |
| క్వేచేలిపాండిస్ ఓస్తియుం | మోక్షద్వారము తెరువువమా |
| బెల్లప్రెముంత్ హోస్తిలియా, | వైరిపోర్లు మమ్మణచెదవు, |
| దారోబుర్ ఫెర్ ఓక్సీలియుం | ఒసగు మాకు బలిమితోడున్. |

2. ఊస్ప్రితినొక్వెదోఖి నొ
సీంత్ పెంపితేర్న గ్లోరియా
క్వీపీతంసీనే తెర్మినొ
నోబిస్ దోనెత్ ఇన్ పాత్రి
యం. ఆమెన్॥

2. ఏక త్రిత్వనాదునికి
ఎల్లకాలముస్తుతి
అంత్యరహితజీవమును
స్వంత దేశమునమాకియ్య
ఆమెన్ జేసు॥

తాంతోఏర్గొ.

1. తాంతుం ఏర్గొ సాక్ర
మెంతుం
వేనెరేముర్ చెర్ను యి
ఎత్ఆంతికుందోకుమెంతుం
నొవో చెదాత్రితుయి
ప్రెస్తెత్ ఫిదెస్ సూప్లె
మెంతుం
సెనూస్వుందే ఫెక్తు యి.

1. అట్టిదేవద్రవ్య అనుమా
నంబును [ము.
శిరమువంచి వందించుదు
పాత వేద ఒప్పందము
క్రొత్త రీతిమై తొలగన్
విశ్వాసముతో నొసగన్
ఇంద్రియంబుల హీనకొర
తకు.

2. జేనితోరి జేనితోక్వె
లావుస్ ఎత్ జూబిలాసియో
సాలుస్ ఓనోర్ వీర్తూస్
క్వొక్వె
సీత్ ఎత్ బెనెదీక్షియో
ప్రొచెదెంతి అబ్ఉత్రోక్వె
కుంపార్ సిత్ లొడాసియో
ఆమెన్॥

2. జనకునికి జనతునికి
స్తుతియు స్తోత్రమును
నుతి,మహిమ,మరిబలిమి
అతి అర్చనయానునట్లే
ఇద్దరునుంచి వెడలువారికి
అట్టదేవగడతయుండన్॥
ఆమెన్ జేసు॥

గురువు-పానెం దె చెలో ప్రెష్టి
తిస్టిఏయిస్ (అల్లేలుయా)

శిశువు-ఓమ్నె డెలెక్తమెం
తుం ఇన్స్అబేఎన్తం (అ
ల్లేలుయ)

లౌదా తె.

1. లౌదా తెనో మినుం ఓ
మ్నెస్ జేం తెస్.
లౌదా తెఏయుం ఓమ్నెస్
పోపులికోనియుం కోన్ ఫిర
మాతాఎస్త సూపెర్ నోస్
మీజెరికోర్దియాఏయుస్,
ఎత్ వెరితాస్ దోమినిమా
నెత్ ఇన్ఎతేర్నుం.

2. గ్లోరియాపాత్రి ఎత్ ఫీలి
యోఎత్ స్పిరితుయిసాం
క్తో.
సీకుత్ ఎరాత్ ఇన్ప్రించి
పియొఎత్ నుంక్ ఎత్ సెంపెర్
ఎతిన్ సెకులసెకులోరుం.
ఆమెన్॥

పరలోకమునుంచి వార్ల
కు అప్పమును ప్రసాదించి
తిరి,

తనలో సకలమధురము
ను గొనియున్నది.

సకలజనులారా కర్తని
పొగడండి.
సకలప్రజలారా వారిని
స్తుతించండి. ఏలనంటె వారి
దయాళత్వము మనమీద
స్థిరమైయున్నది.
కర్తని వాస్తవ్యము స
ర్వదా నిలిచియున్నది.
పితకును సుతునికిని, స్పి
రితుసాంతుకును స్తోత్రము
కలుగును గాక.
ఆదియందుండినట్టు ఇ
ప్పుడును. ఎప్పుడును, అనా
ది సదాకాలమును స్తోత్రము
కలుగునుగాక. ఆమెన్ జేసు

# దేవ మాత కీర్తన.

1

ఆవెమారిస్ స్తెల్ల
దేయిమా తెర్ ఆల్మ
ఆత్త్వే సెంపెర్ వీర్గో
ఫేలిక్స్ చెలిపోర్తా.

2

సూమెంస్ ఇలుడావె
గాబ్రియెలిసోరె
ఫుంద నోసిన్ పాసె
మూతంస్ ఎవేనోమెం.

3

సోల్వె వింక్ల రేయిస్
ప్రొఫెర్ లుమెం సేసిస్
మల్ల నోస్త్ర పెల్లె
బోనా కుంక్తా పోస్కె.

4

మోంస్త్రా తెస్సె మాత్రెం
సుమత్ పెర్ తె ప్రెసెస్
క్విప్రో నోబిస్ నాతుస్
తులిత్ ఎస్సె తుఉస్.

1

సముద్ర నక్షత్రమా నమః
సర్వేశ్వరా నిర్మలాంబ
సదాకాలకన్యా
మోక్షభాగ్యవాకిలీ.

2

ఆవందనము నొంది
గాబ్రియేల్ నోటినుండి
సమాదానమియ్యమాకు
ఏవనామముగూర్చి.

3

నేరస్థుల గొలుసువిప్పు
అంధకులకొసగు వెలుతురు
మాదుచేటులు బాపు
సకలమేలులు వేడు.

4

మీరు మాకు తల్లిగానున్నట్లు చేయండి
మాకొరకు జన్మితుడు
మీ ప్రియమైన పుత్రుడు
మా మనవులు చేకొందురుగాక

5

పీగ్నొసింగులారిస్
ఇంతెర్ ఓమ్నేస్ మీతిస్
నొస్ కుల్పిసోలుతొస్
మీతెస్ ఫాకెత్ కాస్త్రోస్

5

ఉత్తమకన్యకా
అందరికంటె అధిక శాంతిని
కల్మషములకడ జేసి.
కావించుశాంతతుల్యుల
నుగా.

6

వీతం ప్రెస్థపురం
ఈంతెర్ పారతుతుం
ఉత్ విదేం తెస్ జేసుం
సేంపెర్ కొలెతేముర్.

7

సిత్ లోస్ దెఒపాత్రి
సామ్మొక్రీస్థొదేకుస్
స్పిరితుయిసంక్తో
త్రిబుసోనోర్ ఉనుస్
ఆమెన్॥

6

పావనజీవ్యమీయ్యి
భద్రతొ త్రోవనుజూపు
జేసువును దర్శించను
సదాస్తుతిసల్పను.

7

దేవపితకునుతి
ఉన్నతక్రీస్తుకుకీర్తి
స్పిరితుసాంక్తునకును
ముగ్గురి కొకేమహిమ
ఆమెన్ జేసు॥

**Magnificat.**

అర్చసిష్ట కన్యమరియమ్మ సంగీతము.

1. మాగ్నిఫికాత్ అని
మమేఅదోమినుం

1. నాయాత్మమైనది ప్ర
భువుని నమస్కరించి స్తోత్ర
ముచేయుచున్నది.

| | |
|---|---|
| సుపెర్బోస్ మెన్‌తె కోర్ దిస్ సుఇ. | తమ హృదయము యొక్క విచారముచేత గర్వముగల వారను చెదరగొట్టినారు. |
| 7. దెపొజుయిత్ పొతెం తెస్ దెసెదెఎ తెక్సల్ తా విత్ హుమిలెస్. | 7. భలవంతులను ఆశన మునుంచి పడద్రోసి దీనులను ఎక్కించినారు. |
| 8. ఎసురిఎన్ తెస్ ఇమ్ ప్లెవిత్ బొనిస్, ఎత్ దివితెస్ దిమిజితిననెస్. | 8. ఆకలిగొనియుంచేవాళ్లను మేలులతో తృప్తి పరిచి ధనవంతులను వట్టిచేతులతో పంపివేసినారు. |
| 9. సుసెపితిస్రాఎల్ పుఎరుం సుఉం రేకోర్ దాతుస్ మిసెరికోర్ దిఏసువె | 9. తనకృపజ్ఞాపకముచేసితనదాసులైన ఇస్రయేలులను పరిగ్రహించినారు. |
| 10. సికుత్ లోకుతు జెసత్ అద్ పాత్రెస్ నోస్ త్రోస్ అబ్రాహాం ఎత్ సెమినిఏజుస్ ఇన్ సెకులా. | 10. అబ్రహామనేవారికిని సదాకాలము వానియొక్క సంతతివారైన మాపితృలకును ఆయన ఆనతిచ్చిన ప్రకారముగా తనకృపజ్ఞాపకము చేసినారు. |

11 గ్లోరిఅపాత్రి ఎత్ ఫి
లియ్యో ఎత్ స్పిరితుయిసంక్తో
సికుతెరత్ ఇన్ ప్రిన్సిపియో
ఎత్ నున్క్ ఎత్ సెంపేర్ ఎత్
ఇన్ సేకుల సెకులోరుం.

ఆమెన్॥

11. పితకును, సుతునికి
ను, ఇస్పిరితుసాంక్తుకును స్తో
త్రముగలుగునుగాక. ఆదిలో
గలిగినవ్రిత్తిప్ప ఇప్పుడును ఎ
ప్పుడున్ను అనాదిసధాకాల
ము స్తోత్రిముగలుగునుగాక॥

ఆమెన్ జేసు॥

## Te Deum.

తేదేయ్యుం లూదాముస్.
తెదొమినుం కంఫి తెమూర్.
తెఏతెర్నుం పాత్రెం ఒమ్నిస తేరావేనెరతుర్.
తిబి ఒంన్నెస అన్జెలితిబిసెలి ఎతునివేర్ సెపొతెస
త తెస్.
తిబి కెరుబి మెట్ సెరఫిమ్ఇన్ సే సబిలివో సెప్రొక్లమంత్
సంక్తుస్, సంక్తుస్, సంక్తుస్, దొమినుస్ దేవుస్ స
బఓత్.
ప్లెనిసాంత్ చెలిఎత్ తెరమజెస తతిస్ గ్లోరిఎతుఎ.
తెగ్లోరి ఓసుస్ అపస్ తోలోరుంకోరుస్.
తెప్రొఫెతరుం లోదబిలిస్ను మెరుస్.
తెమర్తిరుంకందిదాతుస్ లోద తెగ్జేసితుస్.
తెపెర్ ఓర్బెం తెరరుం సంక్త కంఫి తెతుర్ ఎక్లెజి అ.
పాత్రెమి మెన్ సెమజెస తతిస్.

వెనెరందుంతు ఉం వేరుం ఎత్ ఉనికుంఫిలిఉం.

సంతుం క్వొక్వెపారక్లితుం స్పిరితుం.

తు రెక్స్ గ్లోరి ఎక్రిస్థే.

తు పాత్రిస్ సంపితెర్నుజెస్ ఫిలియుస్.

తు అద్లిబెరందుం సుసెప్తురు సోమినెం నోం నొరుయిస్థి వీర్జినిస్ ఉతైరుం.

తుదెవిక్తొమోర్తిసకులెఓ అపెరుఇస్తి క్రెదెన్తిబుస్ రెగ్న సెలోరుం.

తుఅద్ దెక్స్తెరందెయిసెదెస్ఇన్ గ్లోరి అపాత్రిస్.

జుదెక్స్ క్రెదెరిస్ఎస్సేవెతురున్ (మోకాళ్లమీద యుండుట.)

తెఎర్గొక్వెజుముస్తు యిస్ఫములిస్ సుబ్ వెలిక్వొస్ప్రెసిఒజొసంక్వినె రెదెమిస్థి.

ఎతెర్నఫాకుంసన్క్తిస్తుయిస్ఇన్ గ్లోరిఅనుమెరరి.

సల్వుంఫక్పొపులుంతుఉం దొమినెఎత్ బెనదికె రెది తతిటఏ.

ఎత్ రెజెఎఓస్ఎత్ ఎక్స్తోలెయిలోసుస్క్వెఇన్ ఎతెర్నుం పేర్సింగులోస్దిఎస్ బెనదిసిముస్ తె.

ఎత్ లౌదాముస్ నోమెస్తు వాం ఇన్ సేకులుం ఎత్ ఇన్ సేకులుంసెకులి.

దిగ్నరేదొమినె దియ్యేయిస్ తొసిన పెక్కాతొనొస్ కుస్తొదిరె.

మిజెరెరెనోస్త్రీ దోమినెమిజెరెరెనోస్త్రి.

ఫిఅత్ మిజెరికోర్దిఅతు అదోమినెసుపెర్నోస్క్వెమ ద్మొదుం స్పెరవిమున్ ఇన్ తె.

ఇన్ తెదోమినెస్పెరవినోన్ కోంఫోందార్ యినెతెర్నొం.

గురువు—బెనెదికముస్ పాత్రెమెత్ ఫిలిఉంకుం సన్క్తో స్పిరితు.

శిష్యు—లౌదెమున్ ఎత్ సుపెర్ ఎగ్జల్తెమున్ ఎఉంఇన్ సెకుల.

జన్మమసిలేనిమరియ
దివ్యప్రియంబుమాత
చెలిమికలిమికన్య
వర్ధిల్లా, వర్ధిల్లా...

2

దావీదురాజుగోత్రమే
మోక్షవాసుల స్తోత్రమే
నిర్భిన్నజ్ఞానపాత్రమే
వర్ధిల్లా, వర్ధిల్లా...

3

హేవమ్మ పేరుమార్చితిరే
ప్రకాశరోజపువ్వే
జేసునుకన్నమాతవా
వర్ధిల్లా, వర్ధిల్లా...

4

పితావుయొక్క కుమార్తె
నిత్యసుతునిమాత
సీతిస్పిరితునిమాత
వర్ధిల్లా, వర్ధిల్లా...

5

జన్మమసిలేనిమరియ
దివ్యప్రియంబుమాత
సీతిస్పిరితునెయ్యారే
వర్ధిల్లా, వర్ధిల్లా...

సత్ప్రసాదములో కొనుటకు ఆత్మ జపములు.

విశ్వాసప్రకరణము:—నాదివ్యజేసువా దేవరవారు ది వ్యసత్ప్రసాదములో నిజముగా వేంచేసియున్నారనియు నేను దివ్యసత్ప్రసాదము పుచ్చుకొనునపుడు మీదివ్యశరీర మును రక్తమును ఆత్మను దేవస్వభావమును, నిజముగా పుచ్చుకొనుచున్నాననియు, దృఢముగా విశ్వసించుచు న్నాను॥ ఆమెన్ జేసు॥

ఆరాధనప్రకరణము:—నాదివ్యజేసువా నన్ను సృ ష్టించి, రక్షించి పరిపాలించెడి కర్త మీరే కాబట్టి ఈపర మదివ్యసత్ప్రసాదములో మిమ్ము నమస్కరించి ఆరాధిం చుచున్నాను. ఆమెన్ జేసు.

దైన్యప్రకరణము:—నాదివ్యజేసువా నేను అవలక్ష ణపాపబురదలో పొర్లి అసుద్ధ దుర్గంధముగా యున్నాను. ఇంత నీచుడనుగానుండెడి నాయందు దేవరవారు వేంచేసి వచ్చుటకు నేను పాత్రుడనుగాను. కాబట్టి తమవరప్రసా దమువల్ల నన్ను పరిశుద్ధపరచి మీరే నాహృదయము లో మీకు తగిననివాసమును అమర్చనవధరించండి.

ఆమెన్ జేసు॥

మనస్తాపప్రకరణము:—నాదివ్యజేసువా ఇదివరకు నే ను అనేకమార్లు నాపాపములచేత మీకు అవమానద్రో హములను జేసినందువలన మహాదుఃఖపడుచున్నాను. ఇ ప్పటినుండి పాపము తప్పించుకొనుటకు పడవలసిన కష్టము

లన్ని పడుదునని గట్టిప్రతిజ్ఞ చేయుచున్నాను. దేవరవారు దయచేసి నాపాపములన్ని ఓర్చి మీకటాక్షమును నామీద యుంచ నవదరించండి. ఆమెన్ జేసు॥

నమ్మికప్రకరణము:— నాదివ్యజేసువా దేవరవారు నాహృదయములో వేంచేయుటవలన మీరు నామీద దయగానుండండి. ఇహమందు తగినట్టుగా నడుచుటకును పరమందు నిత్యభాగ్యముపొందుటకును కావలసిన వరప్రసాదములను ప్రసాదించుదురని దృఢముగా నమ్మియున్నాను. ఆమెన్ జేసు॥

దేవస్నేహప్రకరణము:—నాదివ్యజేసువా దేవరవారికడ గురుతులేని సకలమేలుల స్వభావముగాయుండుట వలన అంతటికంటే మిమ్ము నేను సిండుమనస్సుతో స్నేహించుచున్నాను. మరియు నాస్నేహము బహుకొరతగానుండుటవలన మీప్రియతల్లియైన అర్చ్యసిష్ట కన్యమరియమ్మగారియొక్కయు సకల అర్చ్యసిష్టవాళలయొక్కయు స్నేహమును మీకు ఒప్పగించుచున్నాను.

ఆశప్రకరణము —నాదివ్యజేసువా తీవ్రముగా నాహృదయమునందు వేంచేసిరండి నాయాత్మమును మీస్వాదీనముచేసుకొనుటకురండి హా ప్రియజేసువా నాస్నేహమా, నాసంతోషమా, నాభాగ్యమా త్వరగారండి. దేవరవారితో నేను ఐక్యమగుటకు మహా ఆశపడుచున్నాను స్వామి. ఆమెన్ జేసు॥

సత్ప్రసాదముతీయుట కాయత్తమైయుండెడివార్ల మన
స్సులో ధ్యానించి చెప్పవలెనవదగిన జపము.

దయాపరులైన స్వామి నన్ను బ్రతికించుటకు నిర్మల
కన్యాస్త్రీయైన అర్చ్యశిష్టకన్యమరియమ్మగారి గర్భము
లో మనుష్యుడై పుట్టి ఈభూలోకమునకు దివ్యవైద్యులై
వచ్చినదిచాలక తిరిగి అనేకమార్లు ముందరవచ్చినప్రకా
రముగా దివ్యసత్ప్రసాదము మార్గముగా నాయందు వేం
చేసితిరిగదా అట్లాయుండియు మీదివ్యరక్తమునుండి దే
వరవారు కూడించియిచ్చిన సంజీవియైన ఔషధమును నే
నపడ్డజేయక నాయాత్మదుర్గుణములచేత మారుమసులు
కొని మహాకేవలముగాబడి చచ్చుచున్నాను. ఇదివరకు
మీయుపకారములను నేనెరుగనందువలన ఇంతటిరోగము
లు ఎడతెగక బాదించుచున్నవి. దేవరవారు ఈప్రొద్దు
నాహృదయమందు వేంచేసి వచ్చుటకు చిత్తమైయున్నారే
ఈసారి నామూర్ఖగుణములను మీతాత్రిణజేతకదిలించినా
పాపవ్యాధులన్ని నిస్మూలమగునట్లు చేయకరునించండి మీ
కునేను లెక్కలెనిద్రోహములనుజేసితిని అయితే మీకృ
పనుమాత్రము ఒక్కక్షణమైన నమ్మకయుండినది లేదు
మీవంటి దయాపరులచేతిచే హెచ్చయినఉపకారములను
గ్రహించుటకు నావంటిపాపాత్మునికి ప్రాప్తియవుచున్నద
ని మీరేయానతిచ్చితిరిగదా అయినందున మీవాక్యము
తప్పదని నేనుదృఢముగా విశ్వసించుచున్నాను. మీరునా

యందు వేంచేసి నాపాపములన్ని పరిహరించి నేను పుణ్యాను
లో స్థిరముగానుండుటకు, లోకము, శరీరము, పిశాచిఅనె
టి ఈమూడుచత్రువులను జయించినట్లు మీదేవిష్టవరప్ర
సాదములన్నిటిని మహోపకారాలముగా ఇవ్వ కరుణించవల
యునని మిక్కిలి బ్రతిమాలి అడుగుచున్నాను స్వామి.

ఆమెన్ జేసు॥

## సత్ప్రసాదములో కొన్న శాసూక జపము.

ఆశ్చర్య ప్రకరణము;— జేసునాథస్వామి నిజముగా నే యిప్పుడు నాలో ఉన్నారు ఇదియేమి అతిశయము ఇంతనీచునిగానుండెడు నాయందు దేవరవారు వేంచేసివచ్చిన కారణమేమి పరలోకమందు సన్మనస్కులు అర్చ్యసిష్టవారలును మీకుయోగ్యమైన ఆరాధనలను స్తోత్రములనుజేయుదురే నాయందు మీకేమిప్రియమైనకార్యముచిక్కెను.

ఆరాధన ప్రకరణము;— నాసర్వేశ్వరా స్వామి నన్ను సృష్టించినవార దాసుడు మీదివ్యసముఖులో బక్తివినయముతో సాష్టాంగముగఅడ్డపడి మిమ్ము ఆరాదించుచున్నాను నీచునిగానుండెడు దాసుడు మీకుయోగ్యమైనప్రకారముగ ఆరాధనచేయలేనందువలన అర్చ్యసిష్టకన్యామరియమ్మ సకలసన్మనస్కులు అర్చ్యశిష్టవారలు మొదలయినవారల ఆరాదనలను మీకు ఒప్పగించుచున్నాను స్వామి.

స్నేహ ప్రకరణము:— హానాప్రియ జేసువా,నాజీవమా, నామధురమా మిమ్ము నుఅంతటికంటె అధికముగా

స్నేహించుచున్నాను. మిమ్ము మాత్రమే స్నేహించుచు న్నాను దాసుడను దేవరవారిని స్నేహించుచున్నానో యని యడుగుచున్నారు స్వామి మీకు అంతా తెలుసునే నేను మిమ్మును స్నేహించునదియును స్నేహించకయుండు నదియును మీరు ఎరుగుదురు. ఇదివరకు మిమ్మును స్నేహించక యుండునది వాస్తవమే. అయితే ఇది మొదలుకొని నామరణపర్యంతము మిమ్మును మాత్రము స్నేహించ తెగించియున్నాను హానాదివ్యకర్త ఇంత మేలును మహిమయును గలవారునై మట్టులేని దయాస్వరూపియునై మనోవాక్కులకందని అలంకృత ప్రభాశోభనము గలవారునై యుండెడు దేవరవారిని స్నేహించనివారలకు మీ యపోస్తలు వ్రాసిన ప్రకారం శాపము. నేను మిమ్మును స్నేహించకపోతినైన అందరికిముందుగా నాకే శాపము హోదయగల కర్తా దాసుడు అటువంటి భయంకరమైన తీర్పునకు లోబడునట్టు మీ దేవస్నేహాగ్ని నాయాత్మయందు రగులుకొనియుండెడు లాగు జేయనవదరించండి.

మేలెరిగినప్రకరణము:—అర్చ్యశిష్ట కన్యమరియమ్మ సకలస్మనస్కులార, అర్చ్యశిష్ట వారలార స్వామినాకు జేసిన యుపకారముయొక్క గౌరవము ఎంతఘనమైనదని మీకు లెస్స తెలుసుననుటవల్ల వారికిస్తోత్రము చేయుటకు మిమ్ము మనవిచేయుచున్నాను. మట్టులేనిస్నేహమునకును కడ గురుతులేని స్తోత్రమునకును పాత్రులుగానుండెను నా

సర్వేశ్వర స్వామి మీకుసదాకాలము స్తోత్రమును, వినిత సలును, దీవెనలును గలుగునుగాక.

కానుక ప్రకరణము:— నా సర్వేశ్వర! నాయాత్మయు ను, నాశరీరమును, నాచింతనవాక్కు క్రియలను నాహృద యమునుసిందుగ మీకు ఒప్పగించుచున్నాను. ఇకమీదట వాటినన్నిటిని మీకుస్తోత్రముగాను మీకు ప్రియపడనును మిమ్ము ను స్నేహించనున్ను తగిన ప్రకారముగా నడిపించెడి లాగున, నాకుఅనుగ్రహము పాలించి కరుణించండిస్వామి.

సత్ప్రసాదము యొక్క ఫలము బొంద ఆరాధన:— మిక్కిలిన్ని దయాపరిసన్న చిత్తముగలజేసువా మీవలవ సకల దుష్కృతములు పరిహారమైపోయి సుకృతములు గైగొనుటవలన నామనస్సును ఏలుచుండెడు అరిషడ్వర్గ ము, హంకారము, కామము, క్రోధము మొదలయిన దు ర్గుణములన్నిటిని నివారణచేసి సుద్ధమనస్సుతో మిమ్మును నుతించి ఆరాధించి మీకుఏకాలమును సేవజేసి దివ్యసత్ప్ర సాదఫలముపొంది జీవించియుండెడులాగున కృపచేయ నవ దరించండి.

అర్చ్య ఇన్యాశివారు చేసిన జపము:— క్రీస్తువుయొ క్క ఆత్మమా నన్ను పరిశుద్ధ పరచండి. క్రీస్తువుయొక్క శరీరమా నన్ను రక్షించండి. క్రీస్తువుయొక్క రక్తమా నాకు తృప్తిగలిగెడిలాగున చేయకరుణించండి. క్రీస్తువుయొక్క ప్రక్కనుండి కారిపడినసీళ్లా నన్ను కడుగండి. క్రీస్తు అనుభ

వించిన కష్టమూ నాకుధైర్యము కలుగునట్లు చేయకరుణిం చండి. ఓమంచిజేసువా నాప్రార్థనవినవధరించండి. మీ గాయములలోపలనన్ను దాచుకొనండి. నేను మిమ్ముఎడబా యునట్లుచేయకండి దుష్టచత్రువులచేతిలో దొరకనట్లు న న్నుకాపాడండి. నామరణసమయములో మీరు నన్ను పి లుచుకొనండి. నన్ను మీసన్నిదికి రాజేయండి అప్పుడు మీఅర్చ్యశిష్టవారలతోగూడ ముగింపులేని కాలము మి మ్ము స్థుతించుదునుగాక. ఆమెన్ జేసు॥

పరిపూర్ణ ఫలముగల జపము:— మహా మధురము నిండిన మంచిజేసువా దాసుడను దేవరవారి సముఖములో మోకాళ్లమీదనిలచి సాష్టాంగముగాపడి నాచేతులను నా కాళ్లను తొలిసినారు నాయెముకలన్ని యెంచినారు అనిదే వరవారి పేరిట పూర్వకాలమందు దావీదు దీర్గదర్శివచినిం చిన దానిని నాకన్నులముందఉ దేవరవారియొక్క ఐదు గాయములను మిక్కిలి బక్తిపట్టుతోను దుఃఖముతోను నా అంతరంగమందు విచారించి తలంపుచే ద్యానించెదు ఈస మయమందు దృఢమైన విశ్వాసము, నమ్మిక, దేవస్నేహా మనెడు సుకృతతలంపులను నా యక్రమములమీద నిజమై నమనస్తాపమును వ టిని దిద్దుకొన దృఢమైనప్రతిజ్ఞను నా హృదయమందు ముద్రించ నవదరించవలయునని నామం చిజేసువా దేవరవారిని నాయాత్మయొక్క మేలైనఆశ

కాంక్షలతో బ్రతిమాలి ప్రార్థించుచున్నాను స్వామి.
ఆమేన్ జేసు!

సత్ప్రసాదమునకు స్తోత్రము:— వర్ణము, వాసన, రుచి, పరిమానము మొదలయిన గుణములలో నిజముగానే మరుగైయుండెడు దైవత్వమా! మిమ్ము సాగిలపడి నమస్కరించుచున్నాము మిమ్ము యోచించుటలో నామనస్సు ఆశ్చర్యముచేతను నిండుపక్షముచేతను బొత్తిగ సొలసిపోవుటచేత నాచిత్తము నిండుగ మీకే యణుకవై యున్నది. దృష్టిస్పర్శము రుచి మిమ్మును కనిపెట్టనేరక ఏమరుచున్నవి దేవరవారియొక్క వాక్యములను వినిన వినకరివల్లమాత్రమే ఈపరమదేవరహాస్యమును నిశ్చయముతో ఎరిగి విశ్వసించుచున్నాను. పరమ పితాయొక్క సత్యవాక్యములను దేవసుతుడగు దేవరవారియొక్క వాక్యము వినాసత్యమైనది ఒకటిని లేదనుటవలన దేవరవారు ఆనతిచ్చిన వాక్యములన్నిటిని నిండుమనస్సుతో విశ్వసించి నమస్కరించుచున్నాను. దేవత్వముమాత్రమే శిలువలో మరుగైయుండినది. దివ్యసత్ప్రసాదములో యనిన దేవస్వభావమును, మనుష్య స్వభావమునుకూడ మరుగై యున్నవని విశ్వసించి సంకీర్తనముజేసి పశ్చాత్తపపడిన కళ్ళరుడడిగినవరములనేనును అడుగుచున్నాను. అర్చ్యశిష్టతో మాసుగారివలెనే దేవరవారియొక్క దివ్యగాయముల ద్వారమును కావలయునని చెప్పక మిమ్ము నాదైవమని ప్రసిద్ధిగాజెప్పి ఆరాదించి న

మస్కరించుచున్నాను. నేనుమీయందు ఎప్పుడును అధిక మధికముగా విశ్వాసము నమ్మిక భక్తితో నుండ కరుణించవలెను. ఆమెన్ జేసు॥

---

వివిధ జపములు.

1. ఉత్తరించెడు స్థలములోనుండెడు ఆత్మలకు ఉత్తరింపు తీరి మోక్షానందము చేరునట్టు దేవమాతనుజూచి పర్లో. 3పి. త్రి. వేడుకొనుట.

2. పాలకులనుజూచి:—కావలిగానుండెడు సన్మనస్కులున్ను ఇతరసన్మనస్కులున్ను తాముతాము పేరుగొనిన అర్చ్యశిష్టవారలనున్ను తలంచి 3 జ్యో. 3 పి. త్రి. వేడుకొనుట.

3. సమస్థులకు అవసరమైన కార్యములకొరకు:—

ఈరాజ్యమునకు స్వస్థముగలుగను ఈరాజ్యమునేలెడి వారలకు ధర్మబుద్ధియు క్రీస్తువులకు అధికభక్తియు అజ్ఞానులకు దేవప్రకాశమును కష్టపడెడివారలకు సంతోషమును పాపాత్ములకు పాపపరిహారమును మరణముపొందిన క్రీస్తువులకుమోక్షమును, మనకును మనబంధువులకును మన కుపకార అపకారములు చేసేవారికిని క్రీస్తువులకును దేవుని కృపయును రావలయునని అర్చ్యదేవమాతను జూచి (తలంచి) 3 జ్యో. 3 పి. త్రి. వేడుకొనుట.

4. సత్యవేద వ్యాపకులకొరకు:— గురువులు ఈరా
జ్యమందు ఆరోగ్యముగానుండునట్టును గురువులు సన్యాసు
లు వర్ధిల్లను వారలుతలంచినకార్యములు అనుకూలమగున
ట్టును తిరుశభవర్ధిల్లను, దర్మత్రోవలోనడవను అజ్ఞానులు
జ్ఞానోపదేశము వినునట్టును చెడిపోయినక్రీస్థువులు తమస
త్యవేదమునకు మరలునట్టును, సత్యవేద విరోదులకు మం
చిబుద్ది మంచిజ్ఞానమువచ్చునట్టును మార్గమందు ప్రియా
ణముచేయు క్రీస్థువులుసురక్షితముగా తమస్థలములుచేరు
నట్టును సకలదర్మకార్యములు సర్వేశ్వరుడు మనకొనగూ
ర్చేటట్టుగాను సకలఅర్చ్యసిష్టవారలను తలంచి జేసునాధ
స్వామి దివ్యపాదములకు స్తోత్రముగా 8జ్యో. 3ప్రి. త్రి.
వేసుకొనుట.

5. అజ్ఞానులు జ్ఞానోపదేశము వినునట్టుగా:— అనా
దియు సమస్థమునుసృష్టించినసర్వేశ్వరా దేవరవారు అజ్ఞా
నులయొక్క ఆత్మను మీపోలికగా కలుగజేస్ధిరే. ఇదిగో
మీకుఅపకీర్తిగా వారియాత్మలనుంచి నరకమేవారికినిండు
చున్నది. వారలను రక్షించుటకు మీదివ్యకుమారుడు స్లీవ
మీద కఠినముగా మరణముబొందితిరే. నాయేలినవారా
దేవరవారికుమారునికి ఇకను అజ్ఞానులనుండి అపకీర్తివచ్చు
టవలన ఉపేక్షచేయక దయచేసి వారలయజ్ఞానమునుమూ
ర్ఖతనమును జూడక లెక్కలేనిపుణ్యాత్ములుమీదివ్యకుమా
రునిమీద భక్తిగానుండెడు అర్చ్యసభ యావత్తును వారల

కొరకు మీకు ఒప్పగించెను జపతపదానధర్మములను కృప కటాక్షముతో జూచి కరుణించండి లోకమంతటిని బ్రతికించుటకు మీరుపంపినరక్షకుని ఎన్నటికిని కీర్తిగలిగియుండెనిలాగున అజ్ఞానులందరును వారినీతిని వినునట్లు పాలించి కరుణించండి. రజ్యో. 3పి. తీ. వేడుకొనుట.

6. హిందూదేశమునకు ఆపోస్తులయిన అర్చ్యశిష్టతో మాసుగార అర్చ్యశిష్టప్రాంచిస్ శెవెరివారమాకొరకువేడుకొనండి. ఆమెన్ జేసు॥

7. వేదసాక్ష్యులకురాజ్ఞి మాకొరకువేడుకొనుము క్రిస్థువులయొక్క సహాయమా మాకొరకు వేడుకొనుము.

8. పాపాత్ములకు శరణమా, మాకొరకువేడుకొనుము.



దేవరతల్లికి సమర్పణ జపము.

మిక్కిలి పరిశుద్ధకన్యకా పరలోక భూలోకములకు గొప్పరాజ్ఞి మాహృదయమంతటితో మీకుమహిమ గౌరవములు చెల్లించుటకు మీపాదాలఎదుట సాష్టాంగముగా పడుచున్నాము.

మీయొక్క నిష్కళంక జన్మమును సన్మానించుటను మీయెడలప్రేమయు కృతజ్ఞతయు చూపుటకును మమ్మందరిని సదామీకొప్పగించుచున్నాము.

యావన్మందైన స్త్రీపురుషులను తలిదండ్రులను వృద్ధ

లు బలహీనులు బీదలను అనాథలను మాకుటుంభములను స్నేహితులను మావిచారణలో యున్న వారలను మీకు ఒప్పగించెదము.

మాసంతోష దుఃఖములు, పనులు మాయాత్మ శరీరములను, మాజీవిత కాలమంతయును, మాకడ శ్వాసమును మీకు సమర్పించుచున్నాము.

ఓ నిష్కళంక మాతా? ఈగొప్ప సమర్పణను అంగీకరించి మేము పాపము తప్పించి పుణ్యము చేయుటకును పరిశుద్ధముగా జీవించి మృతిపొందుటకును మీయొక్క దివ్య కుమారుని తిరుహృదయానుగ్రహమును దయచేయుదురు గాక- ఆమెన్ జేసు॥



